# చీనా కథలు

ఆస్కాల్ ఎర్క్‌బర్గ్



అనువాదం

జగన్మోహన్



విశ్వసాహిత్యమాల - రాజమండ్రి.

విశ్వసాహిత్యమాల: 19

# చీనా కథలు.

ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్



అనువాదం :

జగన్మోహన్.



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

వెల రు. 1/-

# TALES OF MODERN CHINA.

By: **Oswald Erdburg.**


చీనా కథలు—మొదటికూర్పు 1940 జనవరి.

(మూడుకథలు మాత్రమే)

చీనా కథలు—రెండోకూర్పు 1948 మే.

(ఏడుకథలు చేర్చినకూర్పు)

అవంతీ ప్రెస్ - రాజమండ్రి, ఇ. జి. నెం. 91;

యం. జగన్‌మోహన్‌రావు, క్యూ. హెచ్. నెం. ఇ. జి. 75.

కాపీలు, 1000.

# పీఠిక

మనది ప్రాచీనదేశం, పురాతననాగరికత; మనతో పోల్చదగిన దేశం మరొక టేదైనా వుందంటే అది చైనాయే.

ఒక్క ప్రాచీనతలోనేగాక యింకెన్నెన్నో విషయాల్లో భారతదేశానికీ, చైనా దేశానికీ పోలికలున్నాయి.

చైనా సాహిత్యంకూడా అంత ప్రాచీనమైనదీ, సజీవమైనదీను.

జీవితసంగ్రామంలో, ప్రపంచ చరిత్రలో అనేక ఒడుదుడుకులకు లోనైన చైనా దేశం జాతీయస్వాతంత్ర్యాన్ని పొందింది. కాని దోపిడీమీద, అజ్ఞానంమీద, అసమానతమీద, బానిసత్వంమీదా నిర్మించబడిన సాంప్రదాయిక సామాజికవిధానం, ఆర్థికవిధానం మారిలేదు. ఇంక రాజకీయవిధానం మారిందనడం కేవలం కళ్ళల్లో దుమ్ముకొట్టడమే. ఈ పరిస్థితుల్లో దేశస్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వాస్థ్యాన్ని, సాంఘిక పురోగమనాన్ని కూడా విదేశీయులకు విక్రయించి, తాము కోట్లకు గోడలు కట్టుకున్నారు, చైనా జాతీయనాయకులనబడే వినాయకులు.

ధర్మం జయిస్తుందంటారు, పెద్దలు. తథాస్తు. నేటి చైనాలో జరుగుతున్నదదే!

అసమాన త్యాగాల్నిచేసి చైనాప్రజలు, రైతుకూలీలు నిజమైన జాతీయాభివృద్ధికి రాజబాటను వేస్తున్నారు. ఆ మహాశక్తికి అంజలిఘటించి, ఎందరో సాహిత్యారాధకులు పూజాపుష్పాలనిచ్చి తమ సాహిత్యాన్ని సార్థకపరచుకున్నారు. విశ్వశ్రేయోదాయకమైనదే కావ్యంగదా!

ఈ కథల్లో చైనాదేశపు కూలీరైతుల జీవితసమస్యలూ, పోరాటాలూ, పరిస్థితులూ ప్రతిబింబిస్తూన్నాయి. మన పురోభివృద్ధికి యిట్టి పుస్తకాల అవసరం యెంతేనావుందని మా యభిప్రాయం.

ఆంధ్ర మహాజనులు యిరోధికంగా మా సంస్థకూ, సాహిత్యకృషికీ చేయూతనీయ ప్రార్థిస్తూన్నాము.

30 మే, 1948,
రాజమండ్రి.

మహీధర జగన్మోహన్‌రావు,
సంపాదకుడు.

# విషయసూచిక.


1. మార్చి పద్ధెనిమిది ... 5
2. కాటికుండ చుట్టూ ... 18
3. గండభేరుండం ... 27
4. తాయెత్తు ... 41
5. ధర్మసందేహం ... 51
6. పితౄణ విముక్తి ... 69
7. అతిరథులూ-మహారథులూ ... 77

# మార్చి పద్దెనిమిది

పాలరాతి గోడమీది చెక్కడపు బొమ్మల్నీ, చిరునవ్వులు వెదజల్లు బుద్ధవిగ్రహాల్నీ, కోపంతో ఘూర్ణిల్లుతూ వురుకబోతూన్నట్లున్న సింహాదుల్నీకూడా అస్తంగత సూర్యుడు స్వర్ణకాంతులతో అలంకరిస్తూన్నాడు. చుట్టూవున్న వుద్యానవనంలోని శ్యామలవృక్షాగ్రాలమీద తెల్లని పెగోడా శిఖరాలు బంగరుకాంతిలో స్నానమాడుతూ, పశ్చిమపర్వతసామవుల్లో విహరిస్తూన్న మేఘాలతోబాటు తేలియాడుతూన్నట్లున్నాయి.

నేనారోజున పెగోడాను చూడబోయాను. సాయంకాలపు కాంతిలో నల్లని శవపేటిక విస్పష్టంగా కనిపించింది. ఆ పేటికపైన బంగారు చీలలూ, పువ్వులూ తాపటం చేసివున్నాయి. పూజ్యుడైన సన్‌యెట్‌సేన్ భౌతికశరీరం యీ పేటికలోనే భద్రపరుపబడి వుంది. దానిలో తూర్పు తలగడగా పరుండబెట్టబడిన ఆ మహావిప్లవకారుడు తన జీవితంలో పదమూడుసార్లు పరాజయఖిన్నుడు గావలసి వచ్చిందిట! ఆ పేటిక ద్రాక్షలతలతోను, జాతీయ జెండాలతోనూ చుట్టబెట్టబడి వుంది. దాని చుట్టూ సన్ సాహచర్యంచేత పునీతములైన వివిధ వస్తుసామగ్రి సంచితమై వుంది. పెగోడా లాంతర్లు, కాచపాత్రల్లో వుంచినగంటలు, పింగాణీ పూతపెట్టిన రాగి పాత్రలు, రంగురంగుల రాతిచిప్పలు, చిత్రపు నగిషీపనిచేసిన పాలరాతి తెరలు, చట్రముల్లో వుంచిన ప్రాచీన పత్రాలు, మృణ్మయపాత్రలు, పుష్పములు, మాలలు, ధూపసామగ్రి, పటాలు వగైరా వెన్నెన్నో ఆగదిలో పేర్పబడి వున్నాయి.

చీనాదేశం ప్రాచీననాగరికతా సాంప్రదాయాలు గలది. ఇతరదేశాలతో చిరకాలంగా సంబంధాలు లేక పాతబడి రోతకు తావలమై పోయింది. చీనాయొక్క సనాతన సంకుచిత సాంప్రదాయికాచారాలు డాక్టర్ సన్ జీవితాన్ని చిక్కువడిన నూలుకండెలా చుట్టివేసినాయి.

చనిపోయిన తర్వాత కూడా యీ చిక్కు ఆయనను విడిచిపెట్టలేదు. తన జీవిత చరమకాలంలో అగ్గివంటి యీ విప్లవకారుడు తన్నాక్రమించిన సాంప్రదాయపు సంకెళ్లను బ్రద్దలు చేసేడు. కాని లంచగొండి ఉద్యోగులూ, జిత్తులమారి వర్తకులూ మళ్లీ ఆయనను తమ మాయావాగురలో చిక్కించుకోగగ్గేరు. మృత్యువే వారికి తోడుపడింది. పనికిమాలిన యీ వస్తుసముదాయ సేకరణతో తమ భక్తిని ప్రకటించి, ఓటిక్రించ ఆ విప్లవకారుని బోధనల్ని నిరుపాయంగా సమాధి చేయగలిగేరు. ఇదే ఆ మహావీరునికి గలిగిన పదునాలుగవ పరాజయము!

సమాధి పద్దనుంచి బైలుదేరి చెరువు చూడబోయేను. బంగారు వెండి రంగులతో మిలమిల మెరిసిపోయే రకరకాల చేపలు ఆ సరస్సులోని నిర్మలజలాల్లో ప్రశాంతంగా యీదుతూన్నాయి. చుట్టూ వున్న పిట్టగోడ మీదికి వంగి మత్స్యలోకాన్నవలోకిస్తూ మైమరచిపోయేను.

ఇంతలో నలుగురు చీనా యువకులు నన్ను సమీపించేరు. వారిలో ఒకడు నాతో రష్యన్ భాషలో మాట్లాడ నారంభించేడు. అతని ముఖమంతా మొటిమలతో పొంగివుంది. సాధారణమైన నల్లటి చొక్కాలను ధరించి వున్నారు వాళ్ళందరూ. తాను పెకింగ్ యూనివర్సిటీలో రష్యన్ సాహిత్యశాఖలో విద్యార్థినని చెపుతూ, తమందరూ సన్ సమాధి చూడ్డానికై వచ్చేమన్నాడు. అది డాక్టర్ సన్ యొక్క మరణ దినోత్సవదినం. చైనీయుల జాతీయదుఃఖ దినంలో పాల్గొన్నందుకు విదేశీయుడనైన నాకు తమందరితరఫునా అభినందనాలర్పించేడు. మేము స్నేహపూర్వకంగా సంభాషించుకుంటున్నాము. సందర్భవశాత్తూ అతడు కొరియా దేశీయుడనీ, సియోల్ నుంచి వచ్చేడనీ తెలుసుకొని, నా చిరునామా నాతనికిచ్చి, వారందరినీ నా మకాంకు రమ్మని ఆహ్వానించేను. నాతో మాట్లాడిన విద్యార్థిపేరు పాండూ.

అది పందొమ్మిదివందల యిరవై ఆరో సంవత్సరం. మార్చినెల మధ్యభాగం. ముక్డెన్ సేనలు టీన్ట్సిన్ నగరాన్ని చుట్టుముడుతూ న్నాయి. జాతీయసేనలు టీన్ట్సిన్‌ను రక్షిస్తున్నాయి. ముక్డెన్ సేనలు తీరప్రదేశాలకు రాకండా చేయాలని జాతీయసేనలు నదీముఖద్వారమంతటా మందుగనులు నాటేరు. అంతకు ముందే జనరల్ కో సన్ లిన్‌ను జపాన్ వాళ్లు ఓడించేరు. ఆ గర్వంతో వున్న జపాను సేనలు యీ కలహంలో కూడా చెయ్యిచేసుకోవాలని చూస్తూ, అవకాశం కోసం వేచి వున్నాయి. మందుగనులు వెంటనే తొలగించి, నదిలో నౌకలకి ప్రయాణాను కూలత యేర్పరచమని జపాన్‌వాళ్లు పికింగ్ ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసేరు. అప్పటికప్పుడే పటాలాల్ని ఓడల కెక్కించి సిద్ధంగా వున్నారని కూడా అనుకుంటూన్నారు. జపానువాళ్ళ యెత్తులన్నీ మెఱుపు వేగంతో పడతాయి. అంతా టూకీగా జరిగిపోతుంది. ఒక్కసారి తమ ఫిరంగులు పేల్చేసరికి పెకింగ్ ప్రభుత్వమూ, వాళ్ళ జనరల్సు కాళ్ళబేరానికి వస్తారని జపాన్ ప్రభుత్వానికి బాగా తెలుసు.

ఆ సాయంత్రం నా నూతన పరిచయులు నా మకాంకి వచ్చేరు. మరునాటిమధ్యాహ్నంతో జపానువాళ్ళిచ్చిన అంత్యసందేశపుగడువు పూర్తి వుతుందనీ, జాతీయప్రభుత్వాధ్యక్షుడు జపాను వాళ్ళ కోరికల్ని తిరస్కరించడానికి సాహసించగలడా? అనీ చర్చిస్తూ కూర్చున్నాము. మా వాదప్రతివాదాల్లో పాండూ దుబాషిగా వున్నాడు. వాళ్లు చెప్పేదివింటూ; వాళ్ళ ఉద్రేకపూరితముఖ్యాల్నీ, ఉబ్బిన కనుపొట్టల్నీ చూస్తూ, వాళ్ళని బాగా అవగాహన చేసుకోవాలని యత్నిస్తూన్నాను. వాళ్ళు యీ పోరాటంలో యేపక్షంగా వున్నారు? ఎందువల్ల? యిదే నా ఆలోచన. వాళ్ళు కుటుంబ వాతావరణాన్ని బట్టీ, వ్యక్తి సంస్కృతి స్వభావాన్నిబట్టీ వేర్వేరు తరహాలకు జెందినవాళ్ళు. చైనా జాతీయతకు ప్రాతినిధ్యం వహిస్తూన్న ధనిక, మధ్య తరగతులకు చెందిన విద్యార్థులే వారందరూ.

వాళ్ళందరిలోనూ పెద్దవాడు దూర రాష్ట్రంలోని ఒక పల్లెటూరివాడు. గ్రామాధికారి కొడుకు. సనాతనపద్ధతి వేష భాషలు గలవాడు. అవి రామంగా చేతిలోని పుస్తకపు పుటలు తిరగేస్తూ, అవమానదినాన్ని గురించీ, ఉద్యోగులలోని అవినీతినిగురించీ చెపుతూన్నాడు. అతడు సివిల్ సర్వీసుకు చదివి, తరిఫీదు పొందుదామని పెకింగుకు వచ్చేడు. మొదట రాత్రింబగళ్ళు నిరంతరం చదువులోనే మునిగి వున్నాడు. కాని ప్రస్తుతం పుస్తకాలు ఓ మూలకునెట్టి, రాజకీయాల్లోకి దిగినట్లున్నాడు.

"మనల్ని జపానువాళ్లే పరిపాలిస్తూంటే యింకా మనం పరిపాలనా విధానాన్ని నేర్చుకోడం దేనికి ? నాచదువు పూర్తిచేసి, యెవర్ని పరిపాలించాలో నాకర్థం కావటంలేదు!" అన్నాడాతడు యెంతో అభిమానంతో.

ఈతణ్ణి సమర్థించేడు యింకో సన్నటి కుర్రవాడు. ఆతడికి పద్దెనిమి పేళ్లుంటాయి. అందగాడనే చెప్పాలి. ఇంగ్లీషులో చక్కగా మాట్లాడుతున్నాడు. కాని కొన్ని శబ్దాల ఉచ్చారణ మాత్రం చిత్రంగా వుంది. ఇతడు షాంఘై క్రిస్టియన్ కాలేజీ పట్టభద్రుడు. పెకింగులో విద్య పూర్తి చేద్దామని వచ్చేడు. శుభ్రమైన తెల్లని సూటులో, తుఁగటోపీ ధరించిన యీ యువకుడు దివ్యవిగ్రహంలా వున్నాడు. ఆతడు చీన సాహిత్య కృషినీ, ప్రేమగీతాల్నీ, టెన్నిస్ ఆటనీ విడిచిపెట్టి విప్లవం కోసం కలలు కనడం ఆశ్చర్యంగానే వుంది.

మూడో యువకుడు యింతసేపూ అంతగా మాట్లాడనే లేదు. అప్పుడప్పుడు మాత్రం యేవో చిన్నచిన్న సూచనలు చేస్తూన్నాడు. ఆతడు మాట్లాడుతూంటే పాట పాడుతూన్న ట్లుంటుంది. దీన్నిబట్టి యీతడు దాక్షిణాత్యుడనీ, క్వాంటంగ్ రాష్ట్రం వాడనీ తెలుసుకోవచ్చు. తన వృత్తాంతం యేమీ చెప్పకనే ఆతడు మాసంభాషణ ఆగినపుడల్లా మధ్య మధ్య సోవియటు రష్యాలోని జీవితవిధానాన్ని గురించీ, అక్కడి పరిస్థితుల్ని గురించీ అడుగుతూండేవాడు.

ఏది యెల్లాగున్నా వీళ్ళలో ఒక్కడూ చైనా సాంప్రదాయాల ననుసరించే విద్యార్థుల్లా లేడు. వాళ్ళల్లాగ చీనా సిరాబుడ్డీ, కుంచెలూ పట్టుకుని, గదిలో యేకాంతంగా కూర్చుని వందలకొద్దీ పుటలు అక్షరపు బొమ్మలతో నింపుతూన్నవాళ్లుకారు వీళ్ళు! ఆ విచిత్రాక్షరాల్లోనే రాబోయే ఉద్యోగ చిహ్నాలున్నాయి. అందమైన వ్రాత, ఉదాత్తమైన వచనశైలి, ఏనాటివో ప్రాచీనయోగుల సూక్తిరత్నాలు,—యివీ విద్యార్థులు శ్రమపడి చిత్రించాల్సినది! ఈ నలుగుర్నీ చూస్తూంటే నాకొక వింతసంతోషం కలిగింది. ఇరవైఐదు శతాబ్దాలనుంచీ ఆత్మశుద్ధి, వినయం, సామరస్యజీవనం, శాంతిమార్గము, మోక్షసాధన మొదలైన మహద్విషయాలనిగూర్చి [illegible] యేసు, ఆయన అసంఖ్యాకశిష్యవర్గమూ హాస్ వంశీయులకు చేసిన నిరంతరబోధనమంతా వృథా అయిపోయిందికదా అనుకున్నా. ఈ నాటి యువకులు మోక్షసాధనకు పనికివచ్చే సజ్జుమాత్రం కాదు! చెన్‌వాన్ రాష్ట్రీయుడైన గ్రామాధికారి కుమారుడు, కొరియా యువకుడు, పక్కా అమెరికన్ పద్ధతిలో తయారైన షాంఘై కుర్రవాడు, దాక్షిణాత్యుడైన కాన్‌టన్ వడుసువాడూ కూడ కోపం అంటే యెరుగని వాళ్లుకారు. వాళ్ల కోపతాపాల్నీ, జుగుప్సాద్వేషాల్నీకూడా యెరుగుదురు. పోరాడాలనే ఉద్ధతీ, ప్రశ్నించే సాహసం గలవాళ్ళు కన్ఫ్యూషియస్‌కు శిష్యులెట్లా అవుతారు?

"ఇంపీరియల్‌పాలెస్ యెదుటి చతుష్పథంలో రేపు మీటింగు జరుగుతుంది. జపాన్‌వాళ్ళ అంతిమసందేశాన్ని నిరసిస్తూ ఉపన్యాసాలుంటాయి. మీరుకూడా వస్తానంటే వుదయాన్నే పిలుస్తాము. అన్నాడు పాండు నాతో.

నేనూ 'సరే' నన్నాను.

మార్చి పద్దెనిమిదో తేదీ. మధ్యాహం అయేసరికి నేనూ పాలెస్ స్క్వేర్‌లో వున్నాను. వీధులన్నీ వేలకొలది యువజనులతో నిండి

యిసుకవేసినా రాలనట్లున్నాయి. ఆనాటి మీటింగును వర్ణించడానికి నావల్లగాదు. వక్తల ముఖాలుగాని, ఉపన్యాసాలుగాని నాకు జ్ఞాపకంలేవు. తుపాను వీచుతూంటే సముద్రాన్ని చూసి ఒక్కొక్క అలనే జ్ఞాపకం వుంచుకోవడం యెంతకష్టమో వేరే చెప్పాలా? అటువంటి సందర్భాల స్మృతిచిహ్నంగా మనకు గుర్తుండేదంతా ఒకమహాసంరంభం మాత్రమే. ఉరుములు, మెరుపులు, పిడుగుల చప్పుళ్ళు, కెరటాల ఆర్భాటము, మహావాయుసంరంభం, పొంగులువారు నీరూ - నురుగూ, వీటిమధ్య నావికుల బెదరుముఖాలూ,-యీ అన్నీ కలిసిపోయి మనకు కనిపిస్తాయి. పెకింగువీధుల్లో 1926 మార్చి 18 వ తేదీని గూర్చి నామనసులో యేదో అటువంటి స్మృతి మాత్రమే మిగిలింది. నామనోవీధిపై అసంఖ్యాకమైన జెండాలవరిసలూ, ప్లేకార్డులూ, ఘూర్ణమానమైన మానవశిరస్సముద్రము, పిడికిళ్ళు బిగించి యెత్తబడ్డచేతుల అడివి, అసహ్యాన్ని వెల్లడిచేసే కేకలు, అప్పటికప్పుడు నిర్మించబడిన వేదిక మీదనుంచి బైలుదేరిన అగ్నిహోత్రంలాంటి ఉపన్యాసాలూ,—యివే నిత్యనూతనంగా మెదలుతూన్నాయి.

ఆ మీటింగులో ఆఖరున జరిగిన వొక్కటి మాత్రం నాకిప్పటికీ కళ్ళకు కట్టినట్లుంది. వేదికమీదికి యువకుడొకడు వచ్చి నిలుచుని రక్తంలో తడిసి, చిరిగివున్న చొక్కాలూ,. గౌనులూ రెండుచేతులా పైకెత్తి ప్రదర్శించేడు. రెండు రోజుల క్రితమే తమ నిరసన తెలుపడానికై ప్రెసిడెంటు దగ్గరికు వెళ్ళిన రాయబారంలోని విద్యార్థుల్ని ప్రభుత్వభవనం దగ్గరే సన్నీలతో పొడిచి, లాఠీలతోబాది తరిమివేసేరు. ఆరోజున గాయపడ్డవారి దుస్తులే యివి. వాటిని పైకెత్తి చూపుతూ, ఉత్తేజితుడై ఉపన్యాసం యిస్తూంటే ఆ యువకుని శరీరం నిలువెల్లా కంపించింది. ప్రజల్లోంచి పెద్దగోల బైలుదేరింది.

"తాన్ భవనానికి పదండి!"

"మనల్ని విదేశీయులికి విక్రయించిన ప్రెసిడెంటు నాశనం అవాలి!"

"ప్రెసిడెంటు భవనానికి నడవండి!"

తర్వాత యేంజరిగిందో గుర్తులేదు. కాని కొంచెం సేపట్లో బ్రహ్మాండమైన ప్రజావెల్లువ ప్రెసిడెంటు భవనంపైపు సాగిపోతూంది. ఆ ఊరేగింపులో నేనూ, పాండూ, క్వాంటంగ్ విద్యార్థి. ఒకరిప్రక్క ఒకరం అడుగు కలిపి నడుస్తూన్నాము. మా తలలమీద జెండాలు రెపరెపలాడుతూ యెగురుతూన్నాయి. ప్రాచీనతోరణాలు, ద్వారాలు వచ్చినప్పుడు మాత్రం జెండాలు కొంచెం దించబడుతూన్నాయి. ఉవ్వెత్తుగా సముద్రకెరటాల్లాగ ప్రజాసమూహాలు ముందుకు పోతూన్నాయి. రిక్షాలవాళ్లు వీధి ప్రక్కల నిలుచుని ఊరేగింపును సానుభూతి దృష్టితో చూస్తూన్నారు. పెద్ద టాక్సీల్లో కూర్చున్న అమెరికనులు యేమీతోచక నోట్లో చుట్టలు నమిలేస్తూ, ఛాపర్లతో గుసగుసగా ప్రక్కసందుల్లోకి నడపమని తొందరచేస్తూన్నారు. పోలీసువాళ్ళు ఊరేగింపుకు రెండు ప్రక్కలా బారులుదీరి తుపాకులు భుజాలపై పెట్టుకుని, ఏమీ సంబంధం లేనివాళ్ళలా ఉదాసీనంగా నడిచి వస్తూన్నారు. విద్యార్థులు నినాదాలిచ్చినపుడల్లా వేలకంఠాలు వాటి నందుకొని దిక్కులు పిక్కటిల్లచేస్తున్నాయి. ఈ ధ్వనులు గాలిలో పైకితేలి, మేడలకీ గోడలకీ తాకి ప్రతిధ్వనులీనుతూ, ప్రజల్ని ఉద్రేక పరుస్తూన్నాయి.

ఊరేగింపుతో మేమూ తాజా భవనం దగ్గరకి చేరేము. చుట్టూ యెత్తైన రాతిగోడ, ముందు యినపగేటూ వున్నాయి. కొన్నివందల మందిమి గేటు లోపలికి తోసుకుపోయేం. లోపలంతా రాతిచప్టాచేసేరు, ఆవరణ యెంతో విశాలంగా వుంది. ఇంతలో మావెనకనుంచి గేటు మూయబడి పోయింది. ముందు అల్లంతదూరంలో యినుప కటకటాల వెనుక చెట్లతోపులో ప్రభుత్వభవనం యెత్తైన శిఖరాలతో నిశ్చలంగా

విల్పనిపుంది. భవనమార్గంలో సైనికులు నిలబడివున్నారు. సైనికులు కాకీ దుస్తులు, పోలీసులు నల్లదుస్తులు ధరించి, భుజం భుజం కలిపి గోడలా నిలబడ్డారు. వాళ్ళచేతుల్లో సన్నీలు తళతళలాడుతూ ముందుకు పొడుచుకు వచ్చి వున్నాయి. నాలుగు వరసల్లో నిలబడ్డ వీళ్ళు మొత్తం ఏడెనిమిది వందలుంటారు. వాళ్ళలోంచి ముందుకు చొరబడి పోగల్గటం అసంభవమని తెలిసిపోయింది; మా వెనక యినుపతలుపులు మూయబడి పోయినాయి. మరికొందరు సైనికులు ద్వారం దగ్గర గుమ్మటంలోంచి మరఫిరంగిని పైటకు లాక్కొస్తూన్నారు. కత్తెరదోనులో చిక్కినామని గ్రహించేము.

ఆ మరుక్షణములోనే ఉభయపక్షాల ఆజ్ఞలూ వినవచ్చేయి. ప్రజల పక్షంలో క్షతవిద్యార్థుల రక్తవస్త్రాల్ని ప్రదర్శించిన యువకుని గొంతు వినవచ్చింది:

"ప్రాణత్యాగానికి సిద్ధంగా వున్నవాళ్లు ముందుకురాండి!"

రెప్పపాటులో నూరుగురు విద్యార్థులు ముందునకడుగువేసేరు. మిత్రభాషియైన క్వాంటంగ్ యువకుణ్ణి వాళ్ళల్లో చూసి గుర్తించేను.

ఎదుటినుంచి ఆఫీసరు ఆజ్ఞయిచ్చేడు సైనికులూ, పోలీసులూ మోజర్ల నెత్తి పట్టుకుని, గుర్రాల్ని క్లిక్‌మని సడలించేరు.

విద్యార్థులు ముందుకు నడిచి సైనికుల దగ్గరికి వచ్చేసేరు. ఒక్క క్షణం నిశ్శబ్దం. శత్రువులు ఒకరినొకరు రెప్పవాల్చకుండా చూసుకున్నారు. నిరాయుధులై వున్న విద్యార్థివీరుల ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బిగ్గరగా వినిపిస్తూన్నాయి. ఎదురుగా బానిసలై, అణకువగా వేచియున్న సిపాయీలూ, పోలీసులూ దిష్టిబొమ్మల్లావున్నారు. ఆ వీరుల ఉచ్ఛ్వాసాలకి దూదిపింజల్లా వాళ్లెందుకు యెగిరిపోలేదో నాకు అర్థంకాలేదు.

అవ్వే! ఆదిష్టిబొమ్మలు తుపాకులు కాల్చవు!

ఒక్కక్షణం నిలబడి, సైనికుల్ని కళ్ళల్లోకి చూసినవిద్యార్థులు మరు క్షణంలో ముందునకడుగిడి అచ్చునోటీసుల్ని సైనికుల చేతుల్లో బలవంతంగా కుక్కుతూన్నారు. ఆక్షణంలోనే ప్రభుత్వభవనంలోంచి పొట్టిగా బొండంలావున్న ఉద్యోగి గునగునలాడుతూ బైటికి వచ్చేడు. వాడు బూడిదరంగు దుస్తులు ధరించివున్నాడు. ముఖం కందగడ్డలా జేవురించగా, చేతులు తిప్పుతూ గబగబా మాట్లాడుతూన్నాడు. ఆతడు మాట్లాడిన దాన్ని మా ఊరేగింపు నాయకులు వెంటనే ఖండించేరు. వెనక నుంచి జనం తమ నాయకులు చెప్పినదాన్ని సమర్థిస్తూ కేకలు వేసేరు. పొట్టి గూటంలాటి ఆ ఉద్యోగి చేయెత్తేడు. ఆఫీసరు ఆజ్ఞ ఖడేల్మని వినిపించింది. వెంటనే వార్నింగైనా యివ్వకుండా సైనికులు తుపాకులు బారు చేసి కాల్చేరు. చెవులు ఘడియలు పడ్డాయి. అంతలో పోలీసుల మౌజర్లు క్లిక్ క్లిక్ లాడేయి. దజన్లకొద్దీ ప్రజలు నేలమీద ఒరిగేరు. గాయపడ్డ వాళ్ళ అరుపులూ, మూలుగులూతో వాతావరణం నిండివుంది. మళ్ళీ మూడోసారి తుపాకులు కాల్చిన చప్పుడులో యింకేమీ వినపడలేదు.

అంతా చెదిరిపోయేరు. పడిపోయిన వాళ్ళని వదిలేసి గుడ్డివాళ్ళల్లాగ తలకొక దిక్కుగా పరుగులు ప్రారంభించేరు....కాని దుర్భేద్యమైన రాతి గోడ మాదారిలో కొండలా నిలబడింది.

యాంత్రికంగా నేనూ జనంతోబాటు పరుగెత్తాలనుకున్నాను. కాని, పాండు నన్ను వెనక్కిలాగి ద్వారంవైపు తీసుకుపోయేడు. ద్వారరక్షకుడు నిలబడే గుమ్మటమే మమ్మల్ని రక్షించింది. గుమ్మటానికీ గేటుకూ మధ్యనున్న యిరుకున పదిమందిమి దూరేము. అక్కడనుంచున్న మాకు అంతా కనిపిస్తూనే వుంది. పారిపోతూన్న ప్రజల్ని సైనికులు, పోలీసులు తరిమితరిమి కాలుస్తూనే వున్నారు. తరువాత చెదురుగా దొరికినవాళ్ళనీ, పడిపోయిన వాళ్ళనీ సన్నీలతో పొడిచీ, తుపాకి మడమలతో బాదీ స్వైరవిహారం చేసేరు. ఆవరణా, వీధీ అంతా

ప్రాంగణమంతా మానవశరీరాలతో నిండిపోయింది. తుపాకిమందు వాసనతో గాలి నిండిపోయింది. తుపాకిచప్పుళ్ళూ, దెబ్బలుతిన్నవాళ్ళ కేకలు, సైనికుల పైశాచికాట్టహాసాలూ మా చెవులు బద్దలుకొడుతూ వినబడుతూన్నాయి. సైనికులూ, పోలీసులూ అటునిటు పరుగెత్తుతూన్నారు. వాళ్ళముఖాలు రక్తపిపాసతో భీకరంగా వున్నాయి. ఆవరణలోని రాతి చప్టామీద మానవదేహాలు అస్తవ్యస్తంగా పడివున్నాయి. ప్రతిచోటా రక్తం మడుగులు కట్టివుంది.

కొద్దిసేపట్లో కాల్పులాగి పోయేయి. వాకిలిగేటు తెరవబడ్డింది. బతికివున్నవాళ్ళు ఒక్కపరుగున వీధులోకి త్రోసుకుంటూ పోయేరు. వీధంతా నిర్జనమై పోయింది. అక్కడకూడా కాల్పులు జరిగేయి. పాండూ, నేనూ వీధిప్రక్కగా నడుస్తూ, పడిపోయినవాళ్ల మీదినుంచి దాటిపోతూ తొందరగా ప్రక్క సందుగొందుల్లోకి వెళ్ళిపోయేము. ఎన్నో రిక్షాలు మమ్మల్ని దాటి పోయినాయి. వాటిల్లో గాయాలు తగిలినవాళ్లున్నారు. వాళ్ళ ముఖాలు తెల్లగా అరటిమొవ్వల్లా వున్నాయి; ముఖం మీదా, తలమీదా తగిలిన గాయాలనుంచి నెత్తురు కారుతూంటే, పెదవులు బిగించి మౌనంగా వున్నారు వాళ్ళంతా. రక్తంతో వాళ్ళదుస్తులు తడిసి ముద్దయిపోయి వున్నాయి.

విదేశరాయబారులుండే ప్రాంతానికి చేరుకున్నాక పాండూ వెళ్ళిపోతానన్నాడు. పేవ్‌మెంటుమీద నడుస్తూన్న నాపాదాలు తూలిపోతూన్నాయి. రాయబారుల భవనాలు దర్జాగా నిలబడి గర్వంతో చూస్తూన్నాయి, మాబోటి పాదచారుల్ని.

రెండు రోజులు భారంగా గడిచినాయి. ఈ భయంకర సంఘటన నన్నూ పాండునూ సన్నిహితుల్ని చేసింది. ఆరోజు సాయంత్రం పాండు నాబసకి వచ్చేడు. అతడు నాకెంతో కాలంనుంచి పరిచితుడైన ట్లనిపించింది. స్నేహితులతోరాక ఒంటరిగా వచ్చేవేమని అడిగేను. పాండు

ముఖంలో విషాదచ్ఛాయలు అలముకున్నాయి. తనలోనే యేదో గొణుక్కుంటూ అన్నాడు :

"ఆఁ! నేను యిప్పుడేకాకినే!"

"ఏం? ఏం జరిగింది?"

పాండు వెంటనే జవాబివ్వకండా మౌనంగా వున్నాడు. ఒక్కుమాటుండి హఠాత్తుగా,—

"కామ్రేడ్! పెగోడాలో మనం కలుసుకొన్నరోజున నువ్వన్నది జ్ఞాపకం వుందా? నువ్వు దక్షిణపైనాకు వెడతానన్నావు కాదూ?" అన్నాడు.

"ఔను! అన్నాను. త్వరలోనే వెళ్ళిపోతా"

పాండు కుర్చీలోంచి ముందుకురికి, నాదగ్గరగా వస్తూ, అన్నాడు :

"నేను అడగాలనుకుంటూన్నా, నన్నుకూడా తీసుకు పొమ్మని. నీకు దుబాషి సాయం యెల్లాగా కావాలికదా? చీనాభాష రాకపోతే నువ్వేం చూడగలవు? తెల్లవాళ్ళుండే సెటిల్మెంట్లు దాటి పోనేలేవు! నావిషయం చూస్తే అగమ్యగోచరంగా వుంది. ఇక్కడ సంగతి పోలీసువాళ్లు కనుక్కుంటూన్నారు. ఇక్కడుండి నేను చేయగలదేమీలేదు. అంచేత నీతో వచ్చేస్తా."

"జరిగిందేమిటో స్పష్టంగా చెప్పు" అన్నాను.

"నేను విద్యార్థుల్లో పనిచేస్తూండేవాడిని. ఈ కాల్పులతో విద్యార్థి సంఘాలు నాశనం అయిపాయి. నేను షాంఘైకిగాని, దక్షిణానికిగాని వెళ్ళిపోవాలి. మావాళ్ళు చాలమంది అరెస్టుచేయబడ్డారు. చచ్చిపోయిన వాళ్ళు కూడా తక్కువగారు. మిగిలిన వాళ్లు పట్టణంవిడిచి పోయేరు. వున్న వాళ్ళందరూ బెదిరిపోయేరు. కొన్ని మాసాలు గడిస్తేనేగాని మళ్ళీ వీళ్లు దారిలో పడేటట్లు లేదు. ఫెంగ్ ప్రభుత్వం, జనరల్సు ప్రజలకూ, దేశానికీ ద్రోహం చేసేరు. ముగ్డెన్ సైన్యాలు నగరాన్ని స్వాధీనం చేసుకు

న్నాక వాళ్ళు మాగొంతులు పూరాగా నొక్కేస్తారు. విద్యార్థుల్లో అంతా గందరగోళంగా వుంది. మా విషయం చూడు. మా గ్రూపులో క్వాంటంగ్ విద్యార్థికి తలలో గుండుదెబ్బ తగిలింది; షాంఘైనుంచి వచ్చిన కుర్ర వాడు యిక్కడినుంచి మకాం యెత్తేస్తూన్నాడు. వాడికి యీ దెబ్బతో హడలెత్తింది. విప్లవం అంటే సరదా అనుకున్నాడు! త్యాగాలు చేయాలనీ, తాను అదృష్టవశాత్తూ తప్పి బైటపడ్డాననీ తెలిసి, బిచాణా కట్టేసి, షాంఘైకు వెళ్ళిపోయేడు. ఆలస్యం ఐతే రైల్వేసంబంధాలు కూడా తెగి పోవచ్చునని అతని భయం. స్పోర్ట్సు సమయానికి అందుకుంటాడు. అసలు అతని స్థానం అదే!"

"జెచ్‌వాన్ కామ్రేడ్ వూ యూ టిన్ ఏమైనాడు?"

పాండు కనుబొమలు ముడేసేడు.

"వాడు మన కామ్రేడ్ కాడు. రాతిగోడల్ని ఋర్రలతో బ్రద్దలుకొట్టలే మని వాడికి తెలిసిందట! తనతండ్రి చదువుకోసం పెకింగ్‌కు పంపేడనీ, ఇకనుంచి తాను వచ్చినపని తప్ప వేరే దేంట్లోనూ జోక్యం కలిగించుకోనని నాతో చెప్పేసేడు."

ఒక్క క్షణం పూరుకొని మళ్ళీ ప్రారంభించేడు. పాండు స్వరంలో దృఢనిశ్చయం ద్యోతకమయింది.

"నేను దక్షిణానికి వెళ్ళితీరాలి. షాంఘైలో లక్షలాది కార్మికులూ, క్వాంటంగ్‌లో కోట్లకొలది పేదరైతులూ వున్నారు. నాపని వాళ్ళలోనే వుంది........సన్‌యట్‌సేన్ తనపని దక్షిణాన్నే ప్రారంభించేడు. స్వార్థపరులైన ఉద్యోగులూ, వర్తకులూ యిప్పటిమటుక్కి పెకింగ్‌నుంచి విప్లవాన్ని తరిమేసేరు. డాక్టరు సన్‌యట్‌సేన్ సమాధిమాత్రమే యిక్కడ వుంది. ఆవీరుని పుట్టుక దక్షిణాన్నే."

పాండు చెప్పింది నిజమే. అతడు నాతో వస్తే నాకెంతో ప్రయోజనకారిగా వుంటాడు. ప్రజల నిజపరిస్థితులు భాషరానిదే నేను తెలిసికోనే

లేను. చీనా అంటే చిన్నదేశం గాదు. నామనోవీధిలో వేలకొలదిమైళ్ళ దేశం గిర్రున తిరిగింది. పట్టణాలు, పల్లెలు, పంటభూములు, చౌటి పర్రలు, అంతులేని మైదానాలు, అధిగమించరాని పర్వతాలు, మహా వేగంగా ప్రవహించే నదులూ, అల్లకల్లోలమైన సముద్రాలు ; అనుకోని కష్టపరంపరలు, కరువులు, లేమి; అపాయాలు, పోరాటాలు; నిరంతరం కొత్తకొత్త ప్రాంతీయభాషలు, యెరుగని ఆచారాలు, తెలియని సాంప్ర దాయాలు ; నరరూపరాక్షసులు, అమాయిక కష్టజీవులు,—వీళ్ళనిరంతర పోరాటాలు ; ప్రాచీనమైన యీ విశాలదేశంలో ఒక మహాప్రస్థానం ప్రారంభమైంది. దాన్ని కండ్లారాచూసి తెలుసుకోవాలనే కుతూహలంతో వచ్చిన నాకు ముందు ప్రయాణాలు తలుచుకుంటే యెంతో కుతూహలం కలుగుతూంది. నా అనుభవాలు హృదయవిదారకంగా వుంటాయనీ తెలుసు. అంటులో ఆవేదన కలిగినా అదొక సంతృప్తి.

నా ఆలోచనల్ని పాండు గ్రహించే వుంటాడు. ఒక్కమాటుండి మెల్లగా ప్రారంభించేడు :

"ఈకాల్పులు విప్లవాన్ని చెదరగొట్టేసేయి. కాని అవేమాకు ముందు మార్గాన్ని సూచిస్తూన్నాయి. కొంతకాలందాకా పెకింగ్ మాచేతుల్లోంచి జారిపోయింది. రాజధాని నుంచి ప్రస్తుతం విప్లవాన్ని తరిమివేయగలి గేరు. కానీ, పల్లెప్రాంతాల్ని తుపాను చెలరేగుతూంది. ఆ జంఝామారు తం త్వరలోనే వీళ్ళ ఆయుధబలాన్నీ, రాతిగోడల్నీ నాశనం చేసే స్తుంది. ప్రాచీనమైన చీనాదేశాన్ని యేశక్తీ శాశ్వతంగా అంధకారంలో వుంచలేదు."

పాండు పిడికిలి బిగించిన చేతినెత్తేడు. బ్రహ్మాండమైన విదేశరాయ బారుల భవనాలు సగర్వంగా నిలబడివున్నాయి. అవి చూసిన వాళ్ళకి చీనాప్రజల దౌర్భాగ్యస్థితి మరింత స్పష్టమవుతుంది. వాటిని ధిక్కా రంగా, అసహ్యంతో చూస్తూ .ఒక్క క్షణం పాండు నిశ్చలంగా నిల బడ్డాడు.

పెకింగ్ - కాల్పన్. 10—3—1926.

# కూటికుండ చుట్టూ

వీధివొడుగునా దుద్దుకర్రలూ, తుంగటోపీలూ, గాజుముక్కలూ, రాళ్లూ పడివున్నాయి. పోలీసువాళ్లు అతి నిర్లక్ష్యంగా, రికామీగా నడుస్తూ గాయాలు తగిలినవాళ్లని రిక్షాలమీద యెక్కించి తీసుకుపోతూన్నారు. చతుష్పథంలో ఒక కూలివాడు చచ్చిపడివున్నాడు. వానితలమీదా, ముఖంమీదా వెదురు బల్లెపుపోట్లు చాలావున్నాయి. గాయాలమీద రక్తం గడ్డకట్టివుంది. నోరుతెరుచుకుని, మిడిగ్రుడ్లుతో శూన్యాకాశంచూస్తూన్నట్లున్నాడు.

మధ్యాహ్నమే అక్కడ దొమ్మీ జరిగింది. ఆవూరికూలీలూ, వూచౌ నుంచి వచ్చిన పోటీ కూలీలూ తగువుపడ్డారు. మామూలు కూలిలో సగానికే పనిచేస్తామని వూచౌనుంచి యాభైమంది కూలీలు వచ్చేరు. ఫేతాళవుత్సవానికి పందిళ్లూ, తోరణాలూ, మంటపాలు, వితానాలూ, జెండాలూ కట్టడం ప్రతియేటా వూళ్లో కూలీలే చేస్తూన్నారు. ఈయేడు పొరుగూరినుంచి తక్కువరేటుమీద పోటీకూలీల్ని దించడానికి పెత్తందార్లు ప్రయత్నించేరు. పొరుగూరివాళ్ళని పనిచేయనీయమని వూరికూలీలు పట్టుదలగా వున్నారు. మామూలుకూలికి తక్కువ అంగీకరించమనీ అన్నారు, వాళ్ళు. విరిటితోరణాలు, అలంకారాలుతో పని జరుపుకుపోయినా సరేగాని పోటీ కూలీలచేత పనిచేయించరాదనటంతో వ్యవహారం చెడింది. చివరకి కూలీలూ కూలీలూ చేతులుకలిపేరు. పదిమందిని ఆస్పత్రికి చేర్చేరు. ఒకడు తలబ్రద్దలై చచ్చి వీధిలోపడున్నాడు.

మధ్యచైనా ప్రజాస్వామ్యంలోని సుఖశాంతి సమృద్ధమైన రామరాజ్యంలో కార్మికవివాదాలతీర్పు యీవిధంగా జరుగుతూంది!

సాయంకాలానికి మళ్ళీ వీధులన్నీ యథాప్రకారంగా జనసమ్మర్దంగా వున్నాయి. అక్కడ అంతక్రితమే పెద్దదొమ్మీ జరిగిందని యెవరూ

అనుకోలేరు. బిచ్చగాళ్ళ దీనాలాపాలూ, గంటల గణగణలూ, సోరియా వాళ్ళ పాటలూ, రిక్షాలాగేవాళ్ల ఒగర్పులూ అన్నీ కలిసి ఒకటేగోలగా వుంది. వేడిగాడుపూ. దుమ్మూ ధూళీ భరించశక్యంగాకుండావుంది.

మేము పెద్దబజారులో నడుస్తూన్నాము. రెండువైపులా యిండ్లూ, దుకాణాలూ అన్నీ బంగారు రంగు జెండాలతోనూ, తోరణాలతోనూ అలంకరించబడివున్నాయి. ఒకచోట హఠాత్తుగా నిలబడి పాండు నెత్తి మీది బెండుటోపీ వెనక్కి త్రోసుకుని చేతిబెత్తంతో పైకి చూపించేడు. తలయెత్తి చూద్దునుగదా వీధిపైని గాల్లో కొందరు మనుష్యులు వెదురు కర్రలతో ఆర్చి కడుతూన్నారు. వాళ్ళకి గోచీలూ, నెత్తిమీద నల్లటి తుంగటోపీలూ తప్ప వేరేమీలేవు. పాతిక గజాల యెత్తున ఆరుగురు కూలీలు నీడబొమ్మల్లాగ మాకూ అస్తమిస్తూన్న సూర్యుని అరుణబింబా నికీ మధ్యలో కనిపించేరు. వాళ్ళచేతుల్లో పొడుగాటివంకకత్తులు తళతళా మెరుస్తూంటే, అటునిటు కదులుతూ ఆర్చిని కడుతూన్నారు.

బజారున పోయేజనం కాగితపు విసినికర్రలతో మెల్లగా విసురు కుంటూ, యివేమీ గమనించకుండానే నడుస్తూన్నారు. ముసురుతూన్న దోమల నెంత ఉదాసీనంగా చూస్తూన్నారో అంత ఉదాసీనతతోనూ యీ ప్రమాదపుపనిలో నిమగ్నులైవున్నవాళ్ళని చూస్తూన్నారు.

"వాళ్లు భేతాళోత్సవానికి ఆకాశతోరణం కడుతూన్నారు." అన్నాడు పాండు.

ఎదురుయెండలో నాకు స్పష్టంగా కనపడలేదు, తోరణపు వెదురు బద్దలు. వీధికి రెండుప్రక్కలా గడలుపాతి, వాటిమీద విబవంపుగా ఆర్చికట్టి, అలంకరిస్తూన్నారు. సన్నని వెదురుబద్దలతో చతురాలుగా, నక్షత్రాలుగా, అర్ధచంద్రాకృతిగా రెల్లుతో కడుతూనే వున్నారు. వాళ్ళ పనిముట్లు ఒక్క కత్తులే. చీకటిపడింది. కాగడాలు వెలిగించి, ఆవెలు

తురులో పనిచేస్తూన్నారు. సిల్కు తెరలమీది అలంకారాల్లా అర్చి యిప్పు డిప్పుడే ఒకరూపంలోకి వస్తూంది.

అర్చి మూడు అంతస్థులుగా వుంది. ఒకదానిపై నొకటి మూడు అంతస్థులూ ఆకుపచ్చటి, ఎర్రటి వెదురుబద్దలతో అల్లేరు. ఆకాశంలోని దుష్టగ్రహాల్ని పారద్రోలడానికే వీటి నీరీతిగా నిర్మిస్తారు. పెగోడాలమీద కూడా యిల్లాంటివాటిని చూచేను, నేను.

మేము అక్కడే నిలబడి చూస్తూన్నాము. కాగడాలవెలుతురులో పని సాగుతూంది. వెదురుచట్రంమీదినుంచి గుడ్డతెరలువేసి బిగించేరు. ఆ గుడ్డలమీద రంగురంగుల్లో ధగధగమెరుస్తూన్న బొమ్మలు చిత్రించేరు. మధ్యలో వున్న పెద్ద తెరమీద ఆకుపచ్చటి రంగుతో శరభసాళ్వం చిత్రించబడివుంది. దీని శరీరంనిండా మొసలికిమల్లే డిప్పలు, మంటలు గ్రక్కే పెద్దనోరు, బారైన తోక, ఎర్రగా చింతనిప్పుల్లాంటి మిడిగ్రుడ్లు, మెడనిండా అలలుగాపడేజూలు, నెత్తిమీద నల్లటితురాయి వున్నాయి. రెండోతెరమీద ఒక ఆడుజింక చిత్రంవుంది. మూడోతెరమీద యెర్రని రంగులో గండభేరుండము వుంది. దీనిరెక్కలు బంగారురంగులో వున్నాయి. సగంరాత్రికి పనులన్నీ పూర్తిచేసి, కూలీలు దిగిపోయేరు. కొందరు వంటలుచేస్తూంటే, మరికొందరు నేలమీద చాపలు పరుచుకుని పాచికలాడనారంభించేరు.

వాళ్ళతో తీరికగా మాట్లాడవచ్చునని మేమూ అక్కడికి తయారయ్యేము. మేమూ వెళ్ళేసరికి వంటదగ్గర అడావుడిగా పనిచేస్తూన్న కుర్రాడు అన్నంకుండ దించుతున్నాడు. అన్నం అంతా ఓ పెద్దకొయ్య తొట్టెలో కుమ్మరించి, దానిని చాపమధ్యగా పెట్టేడు. దాని దగ్గరే పెద్ద దాకలో కూర వుంది. చుట్టూ తమతమమూకుళ్ళూ పుల్లలూ తీసుకుని కూలీలు భోజనాలకి సిద్ధంగా కూర్చుంటూన్నారు.

"నై ఛిలా ఫాన్ ల్యోయా?" (మీరు అన్నం తిన్నారా?) అంటూ

మేస్త్రీ మమ్మల్ని కుశలప్రశ్న వేస్తూంటే, మాకు చోటివ్వడానికి కూలీలు సర్దుకుని కూర్చున్నారు.

"వందనాలు. అక్కర్లేదు. మాభోజనంఅయింది. మీరుకూర్చోండి..." అన్నాడు పాండు. దగ్గరలోనే చాపమీద చతికిలపడి చుట్టలుతీసి ముట్టించేము.

"రోజూ యిల్లాగే పనిచేస్తారా? సరిపడాపనులు దొరుకుతాయా? కడుపు నిండా తిండి లభిస్తూందా? ఈ వేళ మధ్యాహ్నం యిక్కడ జరిగిన గలాటాచూచి యెంతో విచారించేము"అని చెప్పమన్నా పాండుని. అతడు చీనా భాషలో తర్జుమాచేసి పెట్టేడు.

చైనీయులు తెల్లవాళ్ళని పరమశత్రువులుగానే చూస్తారు. కాని రష్యను లంటే మాత్రం వాళ్ల మిత్రులుగానే భావిస్తారు. మొత్తంమీద తెల్లవాళ్లతో మాట్లాడాల్సివస్తే వాళ్లు అతిజాగ్రతగా, మర్యాదగా, అటూయిటూ తేలకండా సమాధానాలిస్తూ మాట్లాడతారు. మా వర్చకూడా ఆరీతి గానే సాగుతూంది. మేస్త్రీపట్ల భయభక్తులచేత కూలీలంతా నిశ్శబ్దంగా తమ భోజనాల్లోనే నిమగ్నులై వున్నారు. మేస్త్రీ ఒక్కడే మాకు సమా ధానాలిస్తూన్నాడు. అతని మాటలు సెలయేటి మర్మరధ్వనులతో వస్తూ న్నాయి. గండభేరుండంరెక్కలమీద బంగారు యెరకల్లాగే అతని మాటలుకూడా వింటున్నానా? లేక భ్రమేనా? అనేటట్లుగా వున్నాయి. ఆర్చికి కట్టిన వెదురుబద్దలు వెన్నెట్లో వింతగా కనిపిస్తూన్నాయి. శరభ సాళ్వం క్రోధంతో యెగిరి మీదికి దూకబోతూన్నట్లు తోపిస్తూంది. ఆహార పదార్థాల వాసనలు, అన్నంమీంచివచ్చే ఆవిరియొక్క కమ్మని వాసనా చుట్టుప్రక్కలంతా క్రమ్ముకొన్నాయి. అన్నం పరబ్రహ్మస్వరూపం అంటారు. దాని ప్రభావమొక్కటే యదార్థంగానూ, మిగిలినదంతా మిథ్య గానూ తోస్తే ఆశ్చర్యంలేదు. మానవుల శ్రమనూ, శ్రద్ధనూ, పీటిని, సూర్య తాపాన్నీ, భూసారాన్నీ తనలో గర్భీకృతంగా చేసుకున్న యీ అన్నపు

మెతుకులే సత్యమైనవి; శక్తివంతమైనవి; అందుకనే గ్రాహ్యమైనవి. ఆ అన్నమే అందరినీ యిక్కడికి ఆకర్షించింది. విగ్రహారాధకులవలెనే మేమూ యీ రాత్రిపూట వెన్నెట్లో అన్నంచుట్టూ కూర్చుని వున్నాము.

మేస్త్రీ కష్టసుఖాల్నిగూర్చి మాట్లాడుతున్నాడు.

"సాలుపొడుగునా చాలా పండుగులున్నాయి. ప్రతిపండుగుకీ రక రకాల అలంకారాలు చేయాలని శాస్త్రాలు చెపుతున్నాయి. కాని యీ పట్టణ వాసులకి లోభం మరీ యెక్కువవుతూంది. ఒక్కసారే యేదో ఆర్చికట్టి. దానిక్రిందనుంచే ప్రతి పండుగుకీ దూరుతామంటారు. భేతాళోత్సవం. సంవత్సరాంత్యదినం. వసంతోత్సవం. ప్రజాస్వామ్యదినం.- యింకా అన్నిటికీ ఒకరకం ఆర్చే వుపయోగిస్తామంటారు. అల్లాచేస్తే యీ పనులు చేసేవాళ్ళకి కూడెక్కడిది? ఒక్కరోజు పనిచేస్తేనే సాలుకి సరిపడ్డ ధాన్యం వస్తూంటే బాగావుండును. పోనీ యిళ్ళపనీ అంతంతమాత్రం గానే వుంది. ఈ రోజుల్లో యెవడూ యిల్లే కట్టడంలేదు. గొప్పవాళ్ళంతా తమ ధనం విదేశీబ్యాంకుల్లో దాచుకుంటున్నారు. నా చిన్నప్పటి నుంచే దేవాలయాలు, పెగోడాలూ మరామ్మత్తే మానేశారు. కొత్తవి అసలే కట్టించడంలేదు. పూర్వకాలంలో తావూతైనుంచి చక్రవర్తిదాకా ప్రతి ఒక్కరూ ప్రజానురాగం కోసం బాటలువేయించీ, తోటలుపెంచీ, గుళ్లూ గోపురాలూ కట్టించీ, చెరువులు తవ్వించీ యెంతమందికో పనిచెప్పే వాళ్ళు. ఇప్పుడేముంది? అంతా యుద్ధాలుచేసేవాళ్లే. తన స్వస్థలంలో పట్టుమని పదిరోజులైనా యే అధికారీ నిలబడడు. ఇంక కట్టడాలసంగతి యెవరికి పట్టింది? కొత్తపాలకుడు వచ్చినా వెనుకటి భవనాల్లోనే కాల క్షేపం చేస్తాడు. ఎక్కడా పనులేలేవు. బాబూ! చుట్టుప్రక్కల నుంచి యెందరో పనులకోసం యిక్కడికి మూగుతూన్నారు. అసలువాళ్ళు మావృత్తికి చెందినవాళ్లుగారు. కాని మాకు పోటీవస్తూన్నారు. వాళ్ళ గ్రామాలు వదలిపెట్టి యిక్కడేదో దాచపెట్టినట్లు వస్తారు. మాకే తిండి

దొరక్కుండా వుంటే పైవాళ్ళకి కూడా యీ పట్టణంలో కూడెక్కడిది? బాబూ! చెప్పేందుకేముందిగాని మా కట్టడపు పనివాళ్ళగతి చాలా హీనంగా వుంది. రోజులు యేమీ బాగులేవు."

మేస్త్రీ ఒక్క నిట్టూర్పువిడిచి, విరాళా వ్యంజకంగా చేతులు త్రిప్పుతూ, తొట్టెలోనిఅన్నం మూకుడులో పెట్టుకో నారంభించేడు. కూర్చుని అన్నపుమెతుకులు పుల్లలతో నోటిలోకి తోసుకుంటూ తిండిగొడవలో పడ్డాడు.

"ఈ వేళ పోట్లాటలో యెవరునెగ్గేరు?" అని నాదగ్గరిలోని కూలీని పలకరించేను.

"మీకు తెలియడంలేదూ? అర్చికడుతూన్నది మేముగదా? పూ చౌ కూలీలు పడమటికి వెళ్ళిపోయేరు." అన్నాడు ఉదాసీనతతో గొణుగుతూ.

నాకు వీళ్ళని చూస్తే తగని ఆవేదన బైలుదేరింది. రక్తం ఉడికి పోతూంది. తెరమీదనుంచి ఉరుకబోతూన్నట్టున్న శరభసాళ్వాన్నీ, అందరిదృష్టికీ కేంద్రంగావున్న కూటికుండనూకూడ మరిచిపోయేను. నా మనస్సంతా ఆదురదృష్టవంతులైన అమాయిక కష్టజీవులమీదే వుంది. కండలుదీరిన జబ్బలూ, కృంగిపోయిన గుండెలూ గల ఆ పదిమంది కూలీలే నా ఆలోచననంతనూ ఆక్రమించుకున్నారు.

కూలీల్లో ఐకమత్యాన్నీ, సంఘబలాన్నీ, సంఘశక్తివల్ల ప్రయోజనాల్నీ గూర్చి యేదో మాట్లాడేసేను. పాండు నా అభిప్రాయాన్ని వాళ్ళ భాషలో మార్చిచెప్పేడు. నాలుగు వేల సంవత్సరాలనాటి పురాతన భాషలోని కఠిన సమాసాలంకారాలతో చెపుతూ పాండు తన స్వంత ఉపన్యాసంలోకి దిగేడు. వర్గభేదాలూ, రాబోయీ మంచిదినాలూ, కష్టజీవుల ఐక్యతనూ, పీడితులంతా యేకమై సాగించాల్సిన పోరాటాన్నీ గూర్చి అతడు గబగబా మాట్లాడేస్తూంటే నేను కూడా విభ్రాంతిగా వింటున్నా: ఆ వెన్నెట్లో నా మనోనేత్రం ముందు నూతన చీనా వికసించి కన్పిం

చింది. అభినవమైనా నిర్మాతలగు కూలీలు కోట్లకొలదిగా అరుణపతాక చ్ఛాయలో కదంతొక్కుతూ నడవడం చూస్తూన్నా. పచ్చని దేహాలమీద నీలిచొక్కాలతో, సంకెళ్ళను పటాపంచలు చేసుకుని, దాస్యం- దారిద్ర్యం- దోపిడీ-అజ్ఞానం- పాతరోతనంతా విదళించివేసి పృథ్వినంతా కంపింప జేస్తూన్న యీ వీరుల సాధనాలు వెదురు బల్లెములే! ఆ దృశ్యాన్నిచూస్తూ మైమరచివున్న నన్ను మేస్త్రీ మాటలు మేల్కొల్పేయి.

"లూ బన్ "

తాను తింటూన్న అన్నపు మూకుడును హఠాత్తుగా ప్రక్కకుబెట్టి, చేతులోని పుల్లలతో చందమామను చూపుతూ అన్నాడు మేస్త్రీ.

"ఏమిటి?"

"లూ బన్!" అన్నాడు మళ్ళీ

"లూ బన్ అట్లా చేయడాని కంగీకరించడు!

దాని భావమేమిటన్నట్లు నేను పాండువైపు చూసేను అది గ్రహించి, మేస్త్రీ మావైపు తిగిగేడు ఒక్కక్షణం వూరుకొని, నేల చూపులు చూస్తూ, దృఢస్వరంతో మాట్లాడ నారంభించేడు

"మీరు విదేశీయులు. లూ బన్ అంటే యెరుగరు మా పట్టణంలో చిన్నపిల్లలు కూడా లూ బన్‌కి మా పూర్వులు కట్టించిన దేవాలయాన్ని యెరుగుదురు ప్రతీయేటా లూ బన్‌కి పెద్ద తీర్థం సాగుతుంది కట్టడపు కూలీలంతా, వడ్రంగులూ, ముచ్చిపనివాళ్ళూ, తాపీవాళ్లూ, వెదుళ్ళతో పనిచేసే మేదరులూ అంతా, అన్నిమురాలవాళ్ళూ చుట్టుపట్ల అన్ని గ్రామాలనుంచీ వచ్చి, తమ సంరక్షకుడూ, యిలవేల్పూ ఐన లూ బన్‌ను కొలిచి, ఉత్సవంచేసి వెడతారు. లూ బన్ మహాత్ముడు. హ్వాన్ తీ కాలంలో వుండేవాడు. ఒకసారి గాలివానలో చిక్కుకుని పర్వతాల్లోకి కొట్టుకుపోబడ్డాడు. 'ఏ యజమానైనా కోడెని కోసుకుంటే పేగులు

కూలీల కివ్వాలి, కూలీకి చేపదొరికితే యజమానిని పిలిచి తనతో సమంగా పెట్టాలి' అతడు యింకా యెన్నో మంచి సంగతులు బోధించేడు. ముఠాలన్నింటిలోనూ పైవానికీ క్రిందివానికీ సోదరభావం వుండాలి. సంతృప్తిగలిగి వుండాలి. అప్పుడే నగరప్రాకారదేవతలు మనలో పగలూ, విరోధాలూ ప్రవేశించకుండా కాపాడుతారు.' ఆయన చెప్పినట్లు నడుచుకుంటే తిరుగుబాటులుండవు; దండయాత్రలుండవు; కరువులు రోగాలు దరికిరావు............మనం పనిచేస్తున్నామంటే, కూడుతింటున్నామంటే లూబన్‌కి యెంతో ఋణపడి వున్నాము. ఇందులో సందేహమేలేదు."

చంద్రుడు నడినెత్తికి వచ్చేడు. కూలీలు కుండలోని ఆఖరిమెతుకులు కూడా ఊర్చేసేరు. పాండు ప్రక్కకూలీతో గుసగుసలాడి, నాతో, రష్యన్‌భాషలో చెప్పేడు :

"మేస్త్రీయే కంట్రాక్టరు; యీకూలీ ముఠాకు నాయకుడు. ముఠాలన్నీ కంట్రాక్టర్ల చేతా, కట్టడపుసామగ్రి అమ్మే వర్తకులచేతా నడిపించబడతాయి. కూలీలుకూడా లూబన్ తమ్ము కాపాడుతూంటాడనే నమ్ముతారు. అతడు కాపాడనిచో తమకు కావాల్సిన సామానులు అరువు యెవరిస్తారని వాళ్ళవూహ!"

కూలీలంతా తమకు చిరపరిచితమైన లూబన్ మాట వచ్చేసరికి తలలు పంకిస్తూ, తమలో తాము గుసగుసలు ప్రారంభించేరు.

మూకుడుల్లో ఆఖరిమెతుకులుకూడా యేరేసి, యింకా కడుపునిండక లొట్టవేస్తున్నారు, కూలీలు.

"కూలీలూ, మేస్త్రీకూడా ఒకేకుండలోంచి కూడుతింటారు."అన్నాడు పాండు.

చంద్రుడు మేఘాలచాటున దోబూచులాడుతూన్నాడు. ఆ ఆరచీకట్లో చల్లనిగాలి మెల్లగా వస్తూంది.. అన్నంవాసన మళ్ళీవేసింది. రోజంతా పనిచేసి అలిసిన కూలీలంతా అన్నాన్ని ఆరాధిస్తూ, అన్నదాతకు కృతజ్ఞత

చూపుతూన్నారు. అదిచూస్తే కడుపే కైలాసం. ఆకలే మానవుణ్ణి ప్రేరే పిస్తూంది అని పెద్దలు చెప్పేమాట జ్ఞాపకాని కొచ్చింది.

"వాళ్లూ, వాళ్ళయజమానీ ఒకే కుండలోంచి కూడు తింటారు."

ఈవాక్యం నాచెవుల్లో గింగురు మంటూంది. దీనిమాటున యెంత ద్రోహం సాగుతూంది! ఈ దగాను నాశనం చేయడానికే శరభసాళ్వం కండ్లలోంచి నిప్పులు గ్రక్కుతూ, ఉరకబోతుందా? అనిపించింది.

యంఘ్ షియాంగ్, క్వాంగ్సీ 9—7—1926.

# గండభేరుండము

జర్మనుల చుట్టా, రష్యనుల సిగరెట్టూ, ఇంగ్లీషువాళ్ళ పైపూకూడా కాల్చుకుంటూనే ఏపనైనా చేసుకోవచ్చును; మోటారు నడపుకోవచ్చు: వ్రాసుకోవచ్చు; చెప్పులు కుట్టుకోవచ్చు; చేను కోసుకోవచ్చు; ఓడల్లోకి బొగ్గు నెగుమతి చేయవచ్చు. కాని చైనీయుల పొగగొట్టం మాత్రం అలాంటిదికాదు. నేను మొట్టమొదటిసారి దాన్ని ఓ పెద్దభూస్వామి భవనంలోని పెద్దగదిలో చూసేను. ఆభూస్వామి 'లో' వంశీయుడు. అతడిని గురించి తర్వాత చెప్పుకోవచ్చుగాని ఆపొగగొట్టం సంగతే ప్రస్తుతం తెలుసుకుందాం. అది కాలుస్తూన్నంతసేపూ ఒకచేత్తో గొట్టాన్ని పట్టుకునే వుండాలి. ఒక్క పీల్పుకు సరిపడే పొగాకు మాత్రం అందులో పెట్టి, కాల్చి, మళ్ళీ నింపుతూ వుండాలి; పొగాకు పెట్టినప్పుడల్లా అగ్గి ముట్టిస్తూనే వుండాలి. తుర్కీవాళ్ళ నార్గిలాకూడ యిల్లాంటిదే. గొట్టం ద్వారా నీటిలోంచి పొగ బుడబుడమని వస్తూంటుంది. ఈ ధూమపాన సాధనంలో ముఖ్యాంగం ఒక లోహపుకూజా. దానిమీద మాంచి పనితనంగా నగిషీ చిత్రాలున్నాయి. అందులో బంగారునీటితో గండభేరుండ విగ్రహం యెంతో ప్రాముఖ్యంగా కనిపిస్తూంది. భూస్వామి ధనం విని యోగపడే మార్గాల్లో యిల్లాంటివే ముఖ్యమైనవి. దీన్ని కనిపెట్టినవాళ్ళు సోమరితనానికీ, వృధా కాలయాపనకీకూడ దీన్ని చిహ్నంగా నిర్మించి వుండాలి. ఇది వుపయోగించేవాళ్ళకి పొగ త్రాగడమే ఒక ముఖ్యరాచకార్యం! వాళ్ళకి యింతకంటె మరోపనే వుండదు!

ఇంతకూ భూస్వామి భవంతి యిప్పుడు ఖాళీగానేవుంది. ఆగదిలో నేను చూసిన వస్తువుల్లో ఎన్నో విచిత్రమైనవి వున్నాయి. వాట్లని గురించిన వివరాలు తెలుసుకోడానికెంతో కుతూహలం కలిగి అక్కడివాళ్ళ నడిగేను. మూరెడు పొడుగున్న దంతపుబెత్తం ఒకటి; దాని ఒక కొస అరచేయి మాదిరిగా చెక్కబడివుంది. వీపు గోక్కునేందుకు యిదొక

సాధనం ! జానెడు పొడుగున సన్నని పుల్ల ఒకటి; దీని కొకచివురున బిరుసువెంట్రుకలతో చిన్నబుడిపిలా కట్టబడివుంది. దీనితో చెవులో గులిమి తీసుకుంటారుట ; గుర్రపువెంట్రుకలతో అందంగా కట్టిన కుచ్చు ఒకటి ; యీ సాధనవిశేషంతో యీగల్ని చడీచప్పుడూ లేకుండా యిట్టే చంపవచ్చునట !

భూస్వామియింట్లో యింకా యిట్లాంటి పనిముట్లు యింకేన్నో చూసేను. రోజుకి రోజంతా సోమరిగా కూర్చుని కాలంగడిపేవాడి కివన్నీ అత్యంతావసరములైనవే. బియ్యపుసారా త్రాగడానికి రంగురంగుల పింగాణీపాత్రల సెట్లూ; మొఖమల్‌సంచుల్లో కట్టివుంచిన కైవ్యట్టీపుల్లలు-వీటితో అన్నం తింటారులేండి; మహ్‌జంగ్ పాచికలపెట్టె ఒకటి; ఇల్లాంటివే అక్కడెన్నో వున్నాయంటే నమ్మండి. ప్రతి రాత్రీ ఆభవనమంతా పాచికలాడేవాళ్ళ గోలతో ప్రతిధ్వనిస్తూండేదని అందరూ చెప్పేరు.

తన భూములన్నిటినీ మక్తాకిచ్చి, కాలుమీద కాలేసుకుని విశ్రాంతగా కూర్చునే భూస్వామికిగాక మరెవరి కీ పనిముట్లుకావాలి? భూమినంతనూ ముక్కచెక్కలుగా విభజించి, గ్రామంలోని రెండువందల సుమారు రైతులకూ మక్తాలకిచ్చి, తనకోటలో బాసినపట్టు వేసుకూర్చుని మహ్‌జంగ్ ఆడుతూంటాడు భూస్వామి. అతని దినచర్యలో వ్రాయదగినమహత్కార్యాలు హుక్కాపీల్చడమూ, దంతపుచేత్తో వీపు గోక్కోవడమూ, కుచ్చుతో యీగల్ని వేటాడడమూ,—యివే. కోటచుట్టూ పెద్దయెత్తైన ప్రహరీగోడ; బ్రహ్మాండమైన బురుజులు; మధ్యలో ఆకాశాన్నంటే చతురస్రగోపురం. జూన్‌లోనూ, అక్టోబరులోనూ సాలుసరిపంటలువచ్చే రోజుల్లో రైతులంతా పెద్దపెద్ద వెదురుగంపలతో ధాన్యం పట్టించుకుని గుంపులు గుంపులుగా కోటలోకివచ్చి ప్రాంగణంలోని పెద్దపెద్దసిమెంటు గాదుల్లో పోసిపోతుంటే, గోపురంమీది గదిలో కూర్చుని కిటికీలోంచి పరకాయిస్తూంటాడు, భూస్వామి. అతనికింకో ఆధీ వ్యాధీ లేదు.

రైతులు యెండా వానా అనక మోకాలిబంటి బురదలోను, నీళ్ళలోనూ, ముళ్ళలోనూ, రాళ్ళలోనూ, పగలూ రాత్రీ నడుములు విరిగేలా కష్టపడి పనిచేస్తారు. నారుపోసి, నీరెట్టి, దమ్ముచేసి, ఊడ్చి, కలుపుతీసి, కోసి, నూర్చి, బంగారులాంటి ధాన్యం తెచ్చి భూస్వామి గాదుల్లోపోసి పోతారు. భూస్వామి హుక్కా పీలుస్తూ, చిరుతిండి నములుతూ, దంతపు చేత్తో వీపు గోక్కుంటూ, రాత్రీ పగలూ అనకండా మహ్‌జంగ్ ఆడుతూ, మేడమీది కిటికీలోంచి అదే పనిగా చూస్తూంటాడు. ఈ విధంగానే పదులూ, వందలూ, వేలూ సంవత్సరాలు గడిచిపోయినాయి. 'లో' కుటుంబీకులు తరతరాలుగా, కొంచెమించుమించుగా యీ విధమైన దిన చర్యతోనే కాలక్షేపం చేస్తూ, అదే కిటికీలోంచి శూన్యదృష్టులతో లోకాన్ని తిలకిస్తూ గడిపేసేరు!

సోమరిపోతుగా కూర్చునేవాడికి రోజులో యిరవై నాలుగు గంటలూ యెట్లా జరిగిపోతాయో? ఈప్రశ్న భూస్వామి 'లో' ను అడుగుదామని ఎంతో కుతూహలం కలిగింది. నాలో అతణ్ణి యీలాంటి బాతాఖానీలోకి దించడం—యెంతో వినోదకరంగా వుండితీరుతుందనే నావిశ్వాసం. కాని యీవిషయంలో నాకు ఆశాభంగం కలిగింది. మన దురదృష్టవశాత్తూ భూస్వామి ప్రస్తుతం గ్రామంలో వుండడంలేదు! ఆకోటకంటేనూ స్థిరదని అంతా అనుకున్న భూస్వామిని అక్కడినుంచి కదిలించిన ఆమహాశక్తి యేదో గొప్పదే ఐవుండాలి! రైతుసంఘంవారు ఆకోటనూ, భవనాన్నీ స్వాధీనపరచుకొన్న రోజున యెక్కడికి పరారీ అయేడో యెవరికీ తెలియదు. అంచేత యీప్రశ్ననే అక్కడివాళ్ళ నడిగేను.

మేము యినపగేటు తెరుచుకుని కోటదాటి బైటకి వెడుతున్నాము. మేమంటే,—నేనూ, నాతోవున్న ఇన్ లీ సాన్. చైనీయులకు సర్వసామాన్యమైన నీలిచొక్కా తొడుక్కుని, రొమ్ముమీద రైతుసంఘం బాడ్జీ పెట్టుకుని, దర్పంగా అడుగేస్తూ ఇన్ లీ సాన్ భూస్వామిగాధను చెప్పనారంభించేడు.

మేము పోతూన్నరోడ్డుకు రెండు ప్రక్కలా వరిచేలే. చేలలోని తేట నీటిలో వినీలాకాశం ప్రతిఫలిస్తూంది. పచ్చని వరిమొక్కలు వరుసలు దీరి సిపాయిల్లాగ నిలుచుని, గాలికి యిటునటు కదులుతూన్నాయి. కనుచూపుమేర అన్నీ వరిచేలే. పచ్చటి తివాచీ పరిచినట్లుగా కనులపండుగ చేస్తూన్నాయి. చిన్నచిన్న కాలువలు మర్మరధ్వనులతో మెల్లగా ప్రవహించి పోతున్నాయి. రోడ్డు పొడుగునా రెండువైపులా సమాధిరాళ్ళు నిలబడి, సూర్యరశ్మిలో మెరుస్తూ, మానవునికి నిత్యమూ మృత్యుదేవత సన్నిహితమై వుందని జ్ఞాపకం చేస్తూన్నాయా అనిపిస్తూన్నాయి. ఏపుగా యెదుగుతూన్న వరిమొక్కలమీద వాలుతూ యెగురుతూన్న సీతాకోకచిలుకలు యింద్రధనస్సు రంగుల్ని స్ఫురింప చేస్తూన్నాయి. గండుచీమల యీలలతో చెవులు గింగురు మంటున్నాయి. ప్రకృతి అంతా బహురమణీయంగానూ, హృదయాహ్లాదకరంగానూ వుంది.

ప్రకృతికి మరింతశోభను గూర్చవలసిన మానవుని స్థితి మాత్రం ప్రస్తుతసమాజంలో యెక్కడైనా హృదయవిదారకంగానే వుంటూంది. చీనాలో యిది మరింత విస్పష్టంగా కనిపిస్తుంది. మోకాటిబంటి బురద లోనూ నీటిలోనూ కూలీలు వరుసలుగా వంగి, నడుం యెత్తకండా వరి నారు ఊడుస్తూన్నారు. నెత్తిమీద తుంగటోపీలూ, మొలకు కౌపీనాలూ,- యివే వాళ్ళదుస్తులు. ఎండకు ఎండీ, వానకి తడిసీ పనిచేయడంవలన వాళ్ళ పచ్చటి శరీరాలు కమిలిపోయి నల్లపడ్డాయి. గట్లమీద మేము నడుస్తూంటే తలయినా యెత్తి చూడకండానే వాళ్ళు తమపనిలో మునిగి వున్నారు.

"ఊరు యింకా ఐదు 'లీ' ల దూరంలోవుంది. ఈలోగా 'లో' ఆఖరి దశను గురించి చెప్పుకుంటూ పోవచ్చు," అన్నాడు ఇన్ లీ సాన్.

"అది పన్నెండోనెల. సంవత్సరాది సమీపిస్తూంది. పన్నులవసూళ్లు, భూస్వామి మక్తాలు చెల్లించడం, అప్పులకాతాలు పరిష్కారం చేసుకోడం, యివన్నీ ఆనెలలోనే జరుగుతూంటాయి. వర్తకులంతా పశువుల

చర్మాలు మొదలైనవి పోగుచేసుకుని, రైతులదగ్గర ధాన్యం, అపరాలు వగైరాలు కొనుక్కొని పట్టణాలకి పోతున్నారు పట్టంలో యీసరుకులు అమ్మి, కిరసనాయిలూ, కిరాణా, ఉప్పు, బట్టలు, యింకా పల్లెటూరి వాళ్ళకు అవసరమైన సరకులెన్నో కొనుక్కొని సంవత్సరాదిలోపునే తమగ్రామాలకు చేరుకుంటారు. రైతులు మట్టితో పాత్రల్ని చేస్తూ, మెరుగుపెడుతూ తీరికలేకుండా వున్నారు. రైతుస్త్రీలు రాట్నాలమీద దారం వడుకుతూ, చిలప చుడుతూ తొందరగా వున్నారు. చిన్నపిల్లలు వీధుల్లోనూ రోడ్లమీదా తిరుగుతూ పొయిలోకి చితుకులూ, ఎరువుకు పేడా యేరుతూన్నారు. వసంతకాలపు వ్యవసాయపు పనులింకా అప్పటికి ఆరంభంకావు. పండుగ ముందర గ్రామాలన్నీ సందడిగానూ, ప్రశాంతంగానూ వున్నాయి.

"ఒకరోజు వుదయం పదిమంది మిన్‌టాంగ్ సిపాయీలు సాయుధులై జట్టుగా రైతులందరి యిళ్ళకూ తిరుగుతూన్నారు. మాపొరుగు స్యోటిన్ అనే ఒకరైతు వున్నాడు. అతడు పట్టంలో బాణసంచా వ్యాపారి వద్ద కొంతకాలం పనిచేసి, అప్పటికి మాగ్రామం తిరిగివచ్చి వ్యవసాయం చేసుకుంటూన్నాడు. స్యోటిన్ భూస్వామి 'లో' దగ్గరే పది 'మూ' ల భూమి కౌలుకు తీసుకుని సాగుచేస్తూన్నాడు. అతని యింటి సమీపంలోనే రైతులంతా గుమిగూడి వున్నారు. నేను వెళ్లేను, ఏం జరుగుతూందోనని. మిన్‌టాంగ్ సిపాయీలు యేడుస్తూన్న 'చో' ను గుడిసెలోంచి బైటకు లాక్కొస్తూన్నారు. అప్పటికప్పుడే యాభై అరవైమంది రైతులు అక్కడ పోగయేరు. స్యోటిన్ ముందుకు వచ్చి "సంగతేమిటి?" అని "చో" ను అడిగేడు.

"భూస్వామి మిన్‌టాంగ్ సిపాయీల్ని పంపి పందిని కోసుకున్నందుకు పన్ను చెల్లించమని పీడిస్తూన్నాడు. నాకు అసలు పందేలేదని మీరెరుగుదురు గదా? అల్లాంటప్పుడు నేను పన్ను యెందుకు చెల్లించాలో చెప్పండి" అంటూ చో వాపోయాడు.

"రైతులంతా అతనికి పందేలేదని చెప్పేరు. కాని వినేదెవరు? మిన్ టాంగ్ నాయకుడు మండిపడుతూ లో ప్యాన్ షిన్‌కి తనరైతులందరి పేర్లూ జ్ఞాపకమా యేమిటి? రైతుల్లో యెవడికి పందుందో, యెవడికి కోడుందో తెలుసుకోవడమే ఆయనకు పనా ఏమిటి? పన్నులు వసూలు కావాలా? అక్కర్లేదా? భూస్వామి హుకుం అయింది, రైతులందరి దగ్గరా పన్నులు వసూలు చేయమని. ఎవడు చెల్లించకపోయినా వాణ్ణి అరెస్టు చేయడానికి ఆజ్ఞ వుంది" అన్నాడు.

"పెద్దగోల బైలుదేరింది. రైతులంతా కేకలు ప్రారంభించేరు. స్యోటిన్ అందుకుని "నేనూ పట్నం పోయి వచ్చినవాణ్ణే నాకూ రూల్సు తెలుసు. పందినికోసిన పన్ను పందులున్నవాళ్ళదగ్గరే వసూలుచేయాలి. చో దగ్గిర అసలు పందేలేదు" అంటూ యెదురుక్కున్నాడు.

"మిన్ టాంగ్ నాయకుడు గద్దిస్తూ "యజమాని 'లో' పన్నులు వసూలు చేసేవాడు. అతనికి నీపాటి తెలియదనుకున్నావా? జాగ్రత్త! ఏం చేస్తానో!" అంటూ రైతుల్ని వెళ్ళిపొమ్మని బెదిరించేడు. వాడి మాటలు యెవరూ వినిపించుకోలేదు. ఎల్లా జరిగిందో జ్ఞాపకం లేదుగాని ఓ రైతు, మిన్ టాంగ్ నాయకుడి చొక్కా పట్టుకుని వెనక్కిలాగేడు. వాడేం చేసేడనుకున్నారు? మౌజర్ తీసి గురిపెట్టి కాల్చేడు రైతుకిదాగా గాయం తగిలింది. తుపాకి కాల్పుకి బెదిరి జనంఅంతా పరుగు లంకించు కున్నారు. చో, స్యోటిన్, యింకో యిద్దర్ని సిపాయీలు అరెస్టుచేసేరు. వాళ్ళని సంకెళ్లువేసి గ్రామం వెలుపలికి లాక్కుపోతూంటే మేమందరం యిళ్ళలోంచి కళ్లప్పగించి చూస్తూనే వున్నాము. కోటలో కొద్దిరోజులు వాళ్ళ నలుగుర్నీ నిర్బంధంలోవుంచి, తర్వాత పట్నానికి లాక్కుపోయేరు. గ్రామంలో శాంతికి భంగం కలిగిస్తూన్నారనీ, పన్నులు చెల్లించవద్దని రైతుల్ని పురిగొల్పుతూన్నారనీ వీళ్ళమీద కేసులు పెట్టేరని పదిహేను రోజుల్లో మాకందరికీ తెలిసింది. అక్కడ చావుదెబ్బలుతిని తిరిగివచ్చిన స్యోటిన్‌మాతో ఆగొడవంతా చెప్పేడు. విచారణ జరిగేటప్పుడు జిల్లా

రైతుసంఘం మావాళ్ళ పక్షాన వాదించి, విడిపించిందట. కాని విడుదలై యామెన్ (కచేరీ) గుమ్మం దాటి బైటికి వచ్చేసరికి 'లో' తాలూకు మిన్ టాంగ్ సిపాయీలు మావాళ్ళని పట్టుకుని తుపాకిమడమలతో చావబాది వదలేరట. చో, మరో రైతుకూడా ఆ దెబ్బలతోటే చచ్చిపోయేరు.

"స్వోటిన్ రైతుసంఘంవాళ్ళ కరపత్రం ఒకటి చూపిస్తూ 'పట్నం నుంచి ఊరికే దెబ్బలు మాత్రమే తినిరాలేదు. టోయిస్టుయోగురిచ్చే దివ్యమైన జెచ్‌వాణ్ సూత్రలకంటెనూ మనకెంతో మేలొనగూర్చే దిదిగో చూడండి!' అన్నాడు."

"అది చదివి వినిపించేసు. మేమందరం కొంచిసొమ్ము చందా చేసేసు. లియాన్ టీ హోటలులో కూర్చుని పొగిచిన చిక్కుడు గింజలూ, బటానీల వులుసూ, సారా తెప్పించుకుని విందుగుడుస్తూ ఆలోచనలు సాగించేసు. రాత్రి చాల ప్రొద్దుపోయేవరకూ అక్కడే కూర్చుని మా కష్టనిష్ఠురాల్ని, సమస్యల్ని చర్చించుకున్నాము. ఇంతకూ వర్యవసానంగా ఆ శీతాకాలంలోనే పందుల్ని కోసుకున్నందుకు చెల్లించాల్సిన పన్నులో ఒక్క కానీ అయినా భూస్వామికి యెవరూ చెల్లించలేదు. భూస్వామి కీయవలసిన అప్పులమీద వడ్డీయికూడా చాలమంది రైతులు చెల్లించలేదు."

"మావూళ్లో రైతుసంఘంకూడా యేర్పాటు చేసుకున్నాం. ఈవిధంగా పని ప్రారంభమైంది. ఇంతలోకే వసంతకాలం సమీపించింది. రైతులు తెల్లవారగట్టే లేచి, నాగళ్ళు బుజానపెట్టుకొని, పొలాలు దున్నుకునేటందుకు పోతూన్నారు. మోకాళ్లోతు నీళ్ళలో కర్రనాగళ్ళతో దున్ని దమ్ము లారంభించేము. సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకూ రెక్కలు విరుచుకు పనిచేస్తూన్నా రైతులముఖాల్లో వుత్సాహమే కనిపించేది. భూస్వామికి తమ కష్టార్జితంలో సింహభాగం పెట్టనక్కర్లేకుండా చేసుకోగలమనే ధైర్యం మాలో ఆయేడు నూతనచైతన్యం కలిగించింది.

ధాన్యం నూర్చి గంపలతో పట్టుకెళ్ళి భూస్వామి కోటలో సిమెంటు గాదుల్లో నింపిస్తూనే, తాము పెళ్ళాం పిల్లలతో గంజినీళ్ళకూడా మొహం వాచుతూ గుడిసెల్లో కృంగిపోనక్కర్లేదు. ధాన్యం పట్టణానికి తీసుకెళ్ళి విక్రయించి, మట్టినూని, ఉప్పు, కిరాణాలు కొనితెచ్చుకుని సాలు పొడుగునా ఆలుబిడ్డలతో సుఖపడగలమనే ఆశ కనిపించినప్పుడు వాళ్ళకు పట్టపగ్గాలున్నాయా ? ఆయేడు దమ్ములు మంచి వుత్సాహంగా సాగినాయి.

"లోయొక్క మిన్‌టాంగ్ సోల్జర్లు మళ్ళీ శిస్తులవసూళ్ళకు మావూరి కొచ్చేరు. శిస్తులు చెల్లించకపోతే రైతులనుంచి భూములన్నీ లాక్కొని యితరుల కమరుస్తారని తెలిసి గ్రామమంతా అట్టుడికి పోయింది. రైతు లంతా సత్రం దగ్గర పోగయేరు. కోపంగానూ, ఉద్రేకంగానూ వున్నా రంతా. కాని మాకెవళ్ళకీ ముందేం చెయ్యాలో తెలియదు. స్యోటిన్ గనక ఆసమయానికి రాకపోతే యెవరితిన్నవాళ్ళం చప్పగా జారిపోయేవాళ్ళమే. సరిగా అప్పుడే స్యోటిన్ పదిహేనుమంది రైతుల్ని వెంటబెట్టుకుని ప్రత్యక్షం అయేడు. వాళ్ళందరివద్దా తుపాకులున్నాయి; అంతా సిపాయీ ల్లాగే అడుగువేస్తూ నడుస్తూన్నారు. వాళ్ళని అల్లంతదూరంలో చూసే టప్పటికే మాకెవళ్ళకీ వొళ్ళు తెలియలేదు.

"వాన్‌సుయ్! వాన్‌సుయ్!" (వర్ధిల్లాలి!) అంటూ వుత్సాహోద్రేకా లతో వాళ్ళకి స్వాగతం యిచ్చేము.

"ఆ తరువాత తెలిసింది, మాకు, సిపాయీలు రైతుల యిండ్లకువెళ్ళి ఘర్షణపడే టప్పుడే స్యోటిన్, అతని అనుచరులూ వెళ్ళి ఒక్కొక్కణ్ణీ బెదిరించి తుపాకులు లాగేసేరుట! ఎంత సాహసమో చూసేరా ? స్యోటిన్ సత్రం యెదుటి దిబ్బమీద నిల్చుని రైతుల్ని హెచ్చరించేడు. వెంటనే రైతుదళాన్ని నిర్మించి, భూస్వామికోట స్వాధీనం చేసుకుందా మని చెప్పేడు. మాకందరకూ ఉద్రేకం పెచ్చుపెరిగి పోయింది. ఇది

వరలో స్కోటిన్‌తో బాటుగా అరెస్టు అయి, పట్నంలో మిన్‌టాంగ్ వాళ్ళ చేతుల్లో చావుదెబ్బలుతిన్న రెండో రైతుకూడా మాట్లాడేడు. తన దెబ్బలుచూపి, రైతుల బాధలు గూర్చి చెపుతూంటే అతని కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినాయి. అక్కడ చేరిన వాళ్ళలో కంట తడిపెట్టని వాళ్ళు లేరంటే నమ్మండి. తరువాత యింకా కొందరు మాట్లాడేరు. అక్కడి వాళ్ళల్లో భూస్వామివల్ల అపకారం, అవమానం పొందనివా డొక్కడూలేడు. తన ధరావతుసొమ్ము అపహరించి, భూమి మరొకరికి కౌలుకిచ్చేడని ఒకడు; అప్పుపెట్టి, తన గొడ్డూ గోదా వేలం వేయించి పాడుకొన్నాడని మరొకడు; అనవసరంగా శిస్తు యెక్కువ వసూలు చేసేడని యింకోడు; యిల్లా అందరూ తామదివరలో భూస్వామివల్ల పడిన బాము లేకరువుపెట్టేరు. ఓరైతు దగ్గర్నుంచి అతడి స్వంతపెరట్లో పండిన పళ్లలో సగంపైగా ‹యీనాం' పేరు జెప్పి కాజేసేడట, భూస్వామి మక్తాధాన్యం తూకంలోనూ, కొలతలోనూ రైతులందర్నీ దగాచేసిన వాడే 'లో!' రైతులగోడుతో సభ అంతా మారుమ్రోగి పోయిందారోజు."

"అంతలోకే ఓముసలమ్మ యేడుస్తూ వచ్చింది. భూస్వామి సిపాయీ లామె·భర్తను నిరుడే పట్టణంలో కొట్టి చంపేసేరు. తనూ, బిడ్డలూ కూడా గంజినీళ్లకూడా మోహంవాచి మాడిపోతూన్నామని చెప్పి నపుడు అక్కడివాళ్లందరకూ ఆవేశం కలిగింది. ఆమె చిన్నపాదాల మీద అటూ యిటూ వూగిపోతూ భూస్వామి మానవభక్షకుడనీ, బంది పోటు దొంగనీ, త్రాచుపాములాంటివాడనీ తిట్టి శాపనార్థాలు పెట్టింది."

"అప్పటికి సాయంత్రం అయింది. చీకటి పడుతూంది. ఐనా ఒక్కడూ మీటింగులోంచి కదిలి వెళ్లలేదు. చంద్రుడు పర్వతాలచాటునుండి పైకెక్కి వచ్చేడు. దూరాన్నుంచి యెవరో యిద్దరు మనుష్యులు మావైపే రావటం గుడ్డివెన్నెట్లో కనిపించింది. వాళ్లెవరై వుంటారా? అని ఆలోచిస్తూండ గానే వాళ్లూ మామీటింగులోకి వచ్చేసేరు. వాళ్ల జిల్లారైతుసంఘ ప్రతి

విధులు. చాల దూరాన్నుంచి నడిచిరావటంవల్ల వాళ్ల కాళ్లూ, ఒళ్లూ బూడిద కొట్టుకుని వున్నాయి; బట్టలు మాసి వున్నాయి; ముఖాలు చెమటతో జిడ్డోడుతూ అలసటను సూచిస్తున్నాయి. ఘూస్వామి గవర్నరుకు ఫిర్యాదు చేసేడనీ, ముందు కార్యక్రమం నిర్ణయించుకోమని చెప్పడానికే తాము వచ్చేమనీ వాళ్లు అన్నారు. గ్రామంలో రైతులు కమ్యూనిస్టులు జపోయేరనీ; రహస్యసంఘంగా యేర్పడి, ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ప్రజల్ని పురిగొల్పుతూన్నారనీ; పెద్దల సమాధిస్థలాల నపవిత్ర పరచి, దేవతావిగ్రహాల్ని కాల్చిపారేసి, వయసువచ్చిన స్త్రీలనందర్నీ చెరిచి, వృద్ధుల్ని-పిల్లల్ని చంపేసి; యింకా యెన్నెన్నో ఘోరకార్యాలు చేస్తున్నారనీ ఘూస్వామి రిపోర్టులో రాసేడుట!"

"'గవర్నరు తన స్వంతసైన్యాన్ని యిక్కడికి పంప నిశ్చయించేడు. రెండు రోజుల్లోనే వాళ్లు యిక్కడికి చేరుకుంటారు. మీరు ఆత్మరక్షణకు సిద్ధపడండి' అని వాళ్లు రైతుల్ని హెచ్చరించేరు."

"అక్కడి రైతుల్లో ఒక్కడూ భయపడలేదు. అంతకు పూర్వం సిపాయీలంటే గడగడ వణికిపోయే రైతులు ధైర్యంగా తిరగబడి, ఘూస్వామినీ, ప్రభుత్వాన్నీ శాపనార్థాలు పెట్టనారంభించేరు. మూడు నెల్లక్రిందటే మిన్‌టాంగ్ వాళ్లు స్యోటిన్‌ను తీసుకుపోయేటప్పుడే పారి పోయేం. అప్పుడే గనక గవర్నరు సైన్యాన్ని పంపుతూన్నాడని వింటే మాడాంచుడికీ కొండల్లోకి గొట్టేసి, పెళ్లాం పిల్లలతో పర్వతాల్లోకి పారిపోయేవాళ్లమే! కాని ఆ మీటింగులో పారిపోదామనేవాడొక్కడూ లేడు. మితిమీరిన కష్టాలు మూటరిమునీ, పిరికితనాన్నీ ఆఖరుచేసేయి. ప్రతి ఒక్కడి హృదయం దహించుకు పోతూంది. పరిస్థితుల్ని నిర్భయంగా యెదుర్కోడానికే నిశ్చయం జరిగింది. ఏమి చేయాలి? అనేది నిర్ధారణ కాకపోయినా, చెదిరి తలా ఒకదిక్కుకీ పారిపోకూడదని ప్రతి ఒక్కడూ నిశ్చయించుకున్నాడు. జిల్లాసంఘ ప్రతినిధుల్నీ, మావూరి

పెద్దల్ని సమావేశపరచి, స్నోటిన్ కర్తవ్యనిర్ణయంచేసి, ప్లానువేసేడు. నేనూ, జిల్లాప్రతినిధుల్లో ఒకడూ కలిసి అరవై 'లీ' ల దూరంలోవున్న పెద్దసంతకు వెళ్లి వీలైనంతమంది రైతుల్ని ప్రోగుచేసుకుని, మావాళ్లకి సాయంగా తీసుకురావాలని నిర్ణయం. మేము సంతకు వెళ్లేం. మళ్ళీ రెండు రోజులు పట్టింది తిరిగి రాడానికి. నేను లేనప్పుడు జరిగిన దారుణం వింటేనే నాగుండెలు బ్రద్దలై పోయినాయి........"

ఇంతమట్టు చెప్పి ఇన్ లీ సాఙ ఊరుకున్నాడు.

"తర్వాత యేం జరిగిందేమిటి?" అని ఆతురతగా అడిగేను, నేను.

"ఆమర్నాడే స్నోటిన్ రెండువందలమంది రైతుల్ని చేర్చుకుని ఘూస్వామి కోటను ముట్టడించేడు. తన మిన్‌టాంగ్ సిపాయీలు నలభైమందితోనూ ఘూస్వామి కోటలో దాగి, కోట సింహద్వారం మూయించేసేడు. ప్రజలు చాలమందివున్నా వాళ్ళదగ్గర తుపాకులు పదిహేనే వున్నాయి. మిగిలినవాళ్ళందరూ కత్తులూ, గొడ్డళ్ళూ, కొడవళ్ళూ, బల్లేలూ, రాళ్ళూ, రప్పలూ, చేతికి దొరికిందల్లా పట్టుకుని కోటమీద పురికేరు. మిన్‌టాంగ్ సిపాయీలందరికీ తుపాకులున్నాయి. పైపెచ్చు వాళ్లు కోట గోడలవెనక దాగొన్నారు రైతులు వెల్లడిలో వుండిపోయేరు. నిచ్చెనలు వేసుకుని కోటగోడ లెక్కడానికి యెన్నోసార్లు ప్రయత్నించేరుట. కాని, ప్రతీసారీ సిపాయీలు తుపాకిగుండ్లతో ప్రజల్ని వెనక్కితరిమేస్తూ వచ్చేరు. మావాళ్ళదగ్గర తోటాలుకూడా ఐపో వచ్చేయి. స్నోటిన్‌కి ఆందోళన యెక్కువైంది. గవర్నరు సైన్యం వచ్చేలోపునే కోట స్వాధీనం చేసుకుని, మాటునవుండి ఆత్మరక్షణ చేసుకోవచ్చునని అతని ప్లాను. కాని వ్యవధిలేదు. అప్పటికే చాలమందికి గాయాలు తగిలేయి. కోటమాత్రం చెక్కు చెదరకుండా అట్లాగేవుంది."

"ఆ పరిస్థితుల్లో స్నోటిన్ తెగించి ప్రమాదకరమైన పనికి పూనుకున్నాడు. అతను బాణాసంచా కట్టేవాడని చెప్పేను కాదూ? అబాపతుది

కొంతమందు అతని దగ్గర మిగిలివుంది. దాన్ని తెచ్చి కోట గోడక్రింద సొరంగం త్రవ్వి దానిలో దట్టించేడు. పైనుంచి సిపాయీలు తుపాకి గుండ్లవర్షం కురిపిస్తూన్నా వెనుతీయక స్యోటిన్ మందుకూరి గని సిద్ధం చేసేడు. ఆతడూ సంకేతం యివ్వగానే ఒకరైతు నిప్పంటించేడు. మిగిలినవాళ్లు గని పేలగానే కోటమీద పడడానికి సిద్ధంగా వున్నారు. చెట్ల మాటున, గుట్టల చాటునా రైతులు పులుల్లాగ కాచుకుని వున్నారు. మందుగని యెప్పుడు పేలుతుందా ? అని చూస్తూ అందరూ అక్కడే దృష్టి పెట్టుకుని వున్నారు. స్యోటిన్ ఉద్రేకంతోనూ ఉద్వేగంతోనూ వత్తి అంటుకోడం చూస్తూ, ప్రక్కవాడి జబ్బ పట్టుకుని నలిపేస్తూన్నాడట ! ఎవరూ ఊపిరికూడా వదలటం లేదు ! కొంచెం సేపట్లోనే మందుగని అంటుకుని చెవులు ఘడియలుపడేలా పెద్ద చప్పుడుతో బ్రద్దలైంది. పెద్దపెద్ద రాళ్లుకూడా తుక్కతుక్కగా యెగిరిపోయేయి. అంతటా దుమ్మూ పొగా వ్యాపించింది. కాని కోట తలుపులు మాత్రం అల్లాగే నిలబడి వున్నాయి స్యోటిన్ తెల్లబోయి, వెంటనే మూర్ఛపోయేడు. జరిగిన దేమిటో రైతుల కర్థం కాలేదు. సంకేతం యియ్యకుండానే వాళ్లు గని పేలిన చోటనుంచి యెదిరించడానికి ముందు కురికేరు. సిపాయీలు గుండ్ల వర్షం కురిపించి రైతుల్ని వెనక్కి తరిమి కొట్టేరు. ఆ తర్వాత రెండు గంటలకి గవర్నరు పంపిన సైన్యం వచ్చి చేరింది. కోట తలుపులు తెరిచి, మిన్‌టాంగ్ సిపాయీలు బైటికివచ్చి పడ్డారు. ఆ రాత్రి తెల్లవార్లూ కాల్పులూ, హత్యా, దోపిడీ సాగింది. రైతుల్ని చిత్రవధచేసీ, పశువుల్ని చంపీ, యిళ్లూ గడ్డివాములూ తగులబెట్టీ, స్త్రీలను చెరచీ,— ఒక టేమిటి ? సిపాయీలు నానాభీభత్సం చేసేరు."

"కాని మిన్‌టాంగ్ సైనికులు అందరికంటే యెక్కువగా తమ క్రౌర్యాన్ని ప్రదర్శించేరు. తెల్లవారగట్ల స్యోటిన్, యింకో యిద్దరు రైతులూ గ్రామం వెలుపల ఒక గుహలో దాగుకొని వుండగా పట్టుకొని గ్రామంలోకి లాక్కొచ్చేరు. దారి పొడునా వాళ్ళని బాదుతూ, తన్నుతూ,

సన్నీలతో పొడుస్తూ, చేతనైనన్ని విధాల హింసిస్తూ యీడ్చుకొచ్చేరు. ఆ కిరాతకులు స్కోటిన్ యెడమచేతిని రెక్క గూట్లోకి ఊడలాగేసేరు. ప్సెన్‌హాన్ ఆలయంలోకి వీళ్ళని తీసుకుపోయి, బట్టలు విప్పేసి, కాలు చేతులు త్రాళ్ళతో కట్టేసేరు. శరీరాలమీద కిరసనాయిలు పోసి నిప్పు ముట్టించి ఆనందించేరు సిపాయిలు. సగం కాలేటప్పటికి స్కోటిన్‌ను గట్టిన త్రాళ్ల తెగిపోయేయి. ఆతడు కొనఊపిరితో మంటల్లోంచి పైట కురికి 'జమీందారీవిధానం అంతం కావాలి! సైనిక ప్రభుత్వం నాశన మవాలి?' అంటూ కేకలు వేసేడట!

"సిపాయిలాతణ్ణి పట్టుకుని బల్లెలతోనూ, సన్నీలతోనూ పొడిచి మంటల్లో పడేసి కాల్చేసేరు.

ఇంతవరకూ చెప్పి ఇన్‌లీసాన్ ఊపుకున్నాడు. అతని కింక నోట మాట రాలేదు. నిశ్చేష్టుడై నేలపైపు వెర్రిమాపులు చూస్తూన్నాడు. అప్ప టికి ఊరు సమీపించేము. పట్టిగోడలూ, పెంకుటి రప్పులూ కనిపిస్తూ న్నాయి. దున్నపోతులమీద పడుకుని పసులకాపరులు మందలనదిలిస్తూ తోలుకుపోతూన్నారు. బాటప్రక్క బురదగుంటల్లో గేదెలూ, దున్నలూ పొర్లాడుతూ కన్నులంమోడ్చి సుఖానుభూతినందుతున్నాయి.

"మీరు మళ్లీ గ్రామంలోకి యెప్పుడు వచ్చేరు?" అన్నాను నేనూ పట్టలేక.

ఇన్‌లీసాన్ ఒక్కనిట్టూర్పుతో మళ్లీ ప్రారంభించేడు.

"మేము జిల్లాసంతకు వెళ్ళినరోజు పండుగదినం. దేవతకు ధూపసేవ చేసేరోజు. స్త్రీలూ, పురుషులూ, పిన్నలూ పెద్దలూ, వేలకొలది జనం అక్కడ క్రిక్కిరిసి వున్నారు. జెండాలు యెగురుతున్నాయి; ఢంకాలు మ్రోగుతూన్నాయి; అంతా ఒకటే సందడి. మావూరి సంగతి చెప్పేటప్ప టికి జనంఅంతా వుత్సవం మాటే మరిచిపోయేరు. ఎందరోమాకు సాయంగా రాడానికి సిద్ధపడ్డారు. కాని ఆయుధాలు తెచ్చుకోడం, వాళ్ళ

గ్రామాలనుంచి మరికొందర్నికూడా తీసుకురావడం.- యివన్నీ పూర్తిగా ఆ రోజంతా పట్టింది.

"మరునాడు తెల్లవారుతూండగా మేము బైలుదేరేము. మొత్తం మూడునాలుగు వందల రైతులు మాతో వచ్చేరు. ఆరాత్రి దాగా ప్రొద్దు పోయేక మావూరు చేరుకున్నాము. గ్రామం అంతా శ్మశానప్రాయంగా వుంది. జరిగిన విషయం గ్రహించేము. దుఃఖం, క్రోధం కూడా వచ్చి ముంచెత్తేయి. అంతే- వెంటనే పటాలపు మకాంమీద పడ్డాము. ప్రతీ కారం తీర్చుకున్నాం. ఆనాటి వీరవిహారంతో మత్తెక్కి- నిద్రబోతూన్న సిపాయీలు నిద్రలోనే వీరస్వర్గానికి బోయేరు. ఏకొద్దిమందో బతికిబైట పడి, కాలికి బుద్ధిచెప్పేరు. కోటదగ్గరికి వెళ్ళేసరికి తలుపులు బారుగా తెరిచివున్నాయి. కుటుంబంతోనూ, సిపాయీలు - పరివారంతోనూ భూస్వామి తప్పించుకుని పారిపోయేడు. కోట మాస్వాధీనం ఐపోయింది. రైతుసంఘంజెండా కోటమీద యెగిరింది.........

మేము గ్రామంలో ప్రవేశించేము. ముందుగా బుద్ధుని రాతివిగ్రహం కనిపించింది. బుద్ధదేవుడికి కూడా చిన్నగడ్డం తగిలించి, వొళ్ళంతా రంగులు పామేరు! బలిపీఠంమీద కాలిపోయిన ధూపకాష్ఠాలు పడున్నాయి. పునర్జన్మ సిద్ధాంతాన్ని బౌద్ధులు అంగీకరించేరు. అది నిజమే ఐతే భూస్వామి ఆత్మ ఏజనరలు శిబిరంచుట్టూనో, ఏగవర్నరు భవనం దగ్గరో పరిభ్రమిస్తూ వుండివుండాలి. తాను విధిలేక విడిచివచ్చిన సోమరిజీవితం, హుక్కాగొట్టం, దంతపుచెయ్యి, వెంట్రుకలకుచ్చు, పింగాణీ కప్పులూ, కైవ్లర్జీ.- వీట్లని తలచుకుంటూ, వాటినిమళ్ళీ పొందడానికై తపిస్తూ, తపస్సుచేస్తూ, 'లో' ఆత్మ పరిభ్రమిస్తూందంటే నమ్మదగిన విషయమే! గండభేరుండ పక్షిలా స్పోటిన్ తన చితిమీదినుంచి లేచి లక్షలక్షల రూపాలతో రైతుల విముక్తి పోరాటాల్ని నడిపించకపోతే భూస్వామి కోరిక నెరవేరవచ్చునేమో! కానీ........

షో క్వాన్, క్వాంగ్‌టంగ్. 12-8-1926.

# తాయెత్తు.

మేము యెక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చేస్తూవున్నాము. బండి మంచూరియా సరిహద్దును దాటింది. కిటికీల్లోంచి చూస్తూ కూర్చున్నాము. చెట్టుచేమలు లేని బోడికొండలూ, మంచుతో కప్పబడిన అంతులేని మైదానాలూ మాత్రమే కంటికి కనిపిస్తూన్నాయి. మంగోలియా మీదుగా వచ్చే చల్లటి గాలి యీలలువేస్తూ రివ్వుమని వీస్తూంది. '86' అనివున్న స్థంభం దడాల్‌మని రెప్పపాటులో దాటిపోయింది. వరుసగా కొన్ని సోవియటు జెండాలు కనిపించేయి. ఎండకు, మంచుకు, గాలికి ఆ జెండాలు యెరుపు లోంచి బూడిదరంగులోకి మారుతూన్నాయి.

'మంచూలీ' స్టేషన్‌లో మాపెట్టెలోకి నలుగురు యూరోపియన్‌లు యెక్కేరు. వాళ్ళందరూ చైనా ప్రభుత్వోద్యోగులే. నల్లటి కస్టమ్సు శాఖపీ, నీలిరంగు పోలీసు శాఖపీ యూనిఫారాలు ధరించి, వాటిమీద డాబుగా గిల్టుబొత్తాలూ, భుజకీర్తులూ పెట్టుకున్నవాళ్ళు నలుగురూ వచ్చి మాసామానంతా తణిఖీచేసి, ఎంతో మర్యాదగా మావద్ద సెలవుతీసుకున్నారు. వాళ్లు మాతో యింగ్లీషులో సంభాషించేరు. రిష్యన్ అంతర్యుద్ధాల్లో సెమ్యోనోవ్, కోల్‌చెక్‌ల వైట్‌గార్డు సైన్యాల్లో పనిచేసినవాళ్లట, ఆ నలుగురూ. ప్రస్తుతం చైనాప్రభుత్వం క్రింద పోలీసులుగా పనిచేస్తూన్నారు. తాము యింగ్లీషువాళ్లైనట్లు నటిస్తూంటారువీళ్ళు. వీళ్ళనిగురించి రైల్వేకూలీలు 'వియాత్కానుంచి వచ్చిన యింగ్లీషువాళ్ళు' అంటూంటారు!

అక్కడినుంచి రైల్వేలైను ఆగ్నేయంగా తిరుగుతుంది. ఓ చిన్న స్టేషన్‌లో మాపెట్టెలోకి ఒక శ్వేతస్త్రీ ప్రవేశించింది. ఆమె వైఖరినిబట్టీ, ముఖాన్నిబట్టీ రష్యన్ యువతి అని తెలుసుకోవచ్చు. చాలసేపువరకూ మేము పలకరించుకోలేదు. ఏదో సందర్భంలో సంభాషణ కుపక్రమించినపుడు ఆమె చాల మాటకారి అని గ్రహించేను.

"వాంగ్ ట్సోలిన్ కుమారుని వివాహసందర్భంలో వివాహ వేదిక పైన ఒక రష్యన్ విమానం చక్రాలు తిరుగుతూ, పల్టీలు కొట్టింది. ఆ సమయంలోనే మోటారులో యేదో స్వాధీనం తప్పివుంటుంది. యింజన్ బ్రద్దలై విమానం అంటుకుంది. పైలట్ చచ్చిపోయేడు. అతణ్ణి సమాధి స్థలానికి తిసుకుపోయేటప్పుడు పెద్ద ఊరేగింపుసాగింది. పన్నెండు విమానాల్ని శవపేటికపైన యెగురుతూ పల్టీలువేస్తూ రమ్మని జనరల్ వాంగ్ ట్సోలిన్ ఆజ్ఞలిచ్చేడు! చైనీయులు కృతజ్ఞత చూపటంలో ఎంతమాత్రం వెనుకతీయరు. అటుచూడండి!" అంటూ గ్లోవ్ తొడిగినచేత్తో రైలుపెట్టె మూలకు చూపించింది అటుచూద్దుముగదా ఆమూల్లో సెయింట్ నికోలస్ విగ్రహం ఒకటి వ్రేలాడుతూంది! అంతవరకూ నేను దాన్ని చూడనేలేదు.

అత్యద్భుత మహిమాన్వితుడైన ఆ మహాత్ముడు కొంచెం చెన్నుదరిగి వున్నా 'వ్లాడిమిర్' దేవశిల్పులు యీ సెయింటుకు ఆపాదించిన గాంభీర్యమూ, ఉదాత్తమైఖరీ దానిలో స్పష్టంగా కనిపిస్తూన్నాయి. ఆ మహాత్ముడా మూలనుంచి మావైపు అనుగ్రహదృక్కులు బరపుతూన్నట్లే వుంది. చైనీస్ ఈస్టరన్ రైల్వేసిదకు గ్రీకుసనాతన క్రైస్తవ ధర్మానికి సంబంధించిన యీ విగ్రహాలు యెట్లా వచ్చేయి?

ఈ సందేహం మామనస్సులో పొడమిందేగాని పైకెవరమూ అనలేదు. ఆ రిష్యన్ యువతి మా ఆలోచనల్ని అవగతంచేసుకున్నట్లే మళ్ళీ ప్రసంగం ఆరంభించింది.

"1924 లో యీ రైల్వేయొక్క డైరెక్టర్ల బోర్డులో బోల్షివిక్కులు చేరేరు. ఈ విగ్రహాలన్నింటినీ తీసెయ్యాలని వాళ్ళు పట్టుపట్టేరు. కాని చైనా జాతీయప్రభుత్వం అందుకంగీకరించలేదు! 'ఈ విగ్రహాలుకూడా రైల్వేకంపెనీ ఆస్తుల జాబితాల్లో చేర్చబడివున్నాయి గనక వాటిని తొలగించడానికి వీల్లేద' ని వాళ్ళు వాదించేరు. చీనావాళ్ళు మహామంచి సమాధానంచెప్పేరు లేండి. వైట్‌రష్యన్ యింజనీర్లూ, ఉద్యోగులూ చాల

మంది యీ లైనుమీద పనిచేస్తున్నారు. బోల్షివిక్ విప్లవకారులతో చివర దాకా పోరాడి, ఆఖరున పారిపోయి వచ్చేసేరు వాళ్ళంతా. చైనాప్రభుత్వం వాళ్లందరినీ యెంతో ఆదరించింది. ఇప్పుడు వాళ్ళంతా చైనాపౌరులే. వాళ్ళమాటవినే చైనాప్రభుత్వం బోల్షివిక్కులకు ఆ సమాధానం యిచ్చింది! ఇదంతా నాకు బాగా జ్ఞాపకమే. నా భర్తా యీ రైల్వేమీద యింజనీరే."

నాకు నవ్వువచ్చింది. ఎంత హాస్యాస్పదం, విరుద్ధం! వియాత్కా నుంచి వచ్చిన యింగ్లీషువాళ్ళు! చైనావారి వివాహవేదికమీద వైట్ రష్యన్ పైలట్‌లు పల్టీలు గొట్టడం" సనాతన గ్రీకు చెర్చికి చెందిన సెయింట్‌లు చైనాపౌరులు గావడం!!! అహాహా! దేశ, జాతి, మత భేదాల్ని కూడా త్రోసిరాజనే ఆ మహాశక్తి యేదో? బౌద్ధులు, కన్ఫ్యూషియనులు ఐన చైనాజనరల్సు తమ ఆదరాభిమానాల్ని విదేశీయ క్రైస్తవ మహాత్ముడైన సెయింట్ నికోలస్‌మీద ప్రసరింపజేయడం యెట్లా సంభవించింది? తమ మాతృభూమినుండి పరుగెత్తి వచ్చిన రష్యనులకూ, దేశం యేమైనా తమఅధికారం నిలబెట్టుకోవాలనుకునే చీనాజనరెల్సుకూ గాకపోతే యింకెవరికి పొత్తు కుదురుతుంది? 86 వ స్థంభాని కీవలి ప్రక్కకూడా విప్లవం వస్తుందనే భయమే వీళ్లలో ఐకమత్యం కలుగ జేసింది!

*   *   *   *

మేము గుర్రాలమీద కియాంగ్సీరాష్ట్ర ఉత్తరభాగానికి ప్రయాణం చేస్తూన్నాము. ఆరోజు సాయంకాలానికి ఒకచిన్నకొండమీద వున్నాం. పైనుంచి చూస్తే అల్లంతదూరంలో రోడ్డుమలుపులో కోటగోడలూ, యెత్తైన బురుజులూ కనిపించేయి. సింహద్వారం అప్పటికే మూసేసేరు. పాండు గుర్రందిగి, కళ్లెం నాచేతి కందించేడు.

మేమందరం సిగరెట్లు ముట్టించి, మెల్లిగా మాట్లాడుకుంటూ పాండూ కోసం కనిపెట్టుకుని వున్నాం. ద్వారపాలకులతో మాట్లాడి తలుపులు తెరిపించాలని వెళేడు పాండు.

ఆ రోజున మేము నూరు 'లీ' లు ప్రయాణం చేసేము. గుర్రముల మీద ప్రయాణం నాకసలే అలవాటులేదు. అంచేత జీనుమీద కూర్చోడం అంటే ముళ్లమీద కూర్చున్నట్టే వుందినాకు. పైగా ఆరాత్రంతా పట్టణం బైట గడపాలేమో ? అది తలుచుకుంటేనే కంపరం పుట్టుకొస్తూంది. నిముషాలు మెల్లగా గడుస్తూన్నాయి. గుర్రాలు కళ్లేలు కొరుకుతూ, ఆతురతతో బాట దుమ్మంతా ముంగాళ్ళతో దువ్వి రేపుతూన్నాయి. క్రమంగా నాలుగుదిక్కులూ సిరాలాంటి చీకట్లో మునుగుతూన్నాయి. గాలి చలిగా వీస్తూంది. అంతలో పాండు వేసిన యీలా, తలుపు తెరుస్తూన్నట్లు కిర కిర శబ్దం కూడా వినిపించి ప్రాణాలు లేచొచ్చాయి.

'అమ్మయ్యా ! బ్రతుకుజీవుడా !' అనుకుంటూ ముందుకుసాగేము. బసకు పోయి స్నానంచేసి, బట్టలు మార్చుకుని, సుఖంగా పడుక్కునిద్ర పోవచ్చు. ఒళ్ళంతా హూనమైవుంది. నరాలు పీక్కుపోతూన్నాయి. వేడికి నా మెదడంతా కాచెక్కిపోయింది. చెమటకీ, దుమ్ముకీ ప్రాణం చిరాకుగా వుంది. ఈ ఆరురోజుల ప్రయాణంలోనూ దారిపొడుగునా ప్రకృతి ఒకే రీతిగా వుండి విసుగుపుట్టేసింది కూడాను.

మేమందరమూ మాకుదారి చూపుతూన్న సిపాయీ వెనకనే నడుస్తూన్నాము. ద్వారరక్షకులు అనుమాన దృష్టులతో చూస్తూ మావెనుక వస్తూన్నారు. పాండు ఒక కోటుతీసి వాళ్ళ నాయకుడి చేతిలో జారవిడిచేడు. మార్గదర్శి వీధి మలుపుతిరిగేడు. అదొక సన్నని సందు. చిమ్మచీకటి. అట్లే కొంచెందూరంవెళ్ళి మళ్ళీ యెడమప్రక్కకు తిరిగేము.

ఎదురుకుండా హంసమెడలాంటి సన్నని చెక్కులవంతెన, ఆపైన మంచి వెలుతురూ కనిపించేయి. అది బజారుట. మాకళ్లు మిరుమిట్లు గొలిపేయి, ఆవెలుతురులో. బజారులో ప్రవేశించేము. ధనధాన్యాలూ, వర్తకపుసరుకులు, వస్తుపూర్ణంగా వున్న దుకాణాలు.- బజారెంతో వైభవంగా వుంది. ప్రకాశమానమైన దీపాలు, ఉల్లాసకరమైన మాటలు, సర

కులు ఖరీదుచేస్తూన్న ప్రజలు. కుప్పతిప్పలుగా వున్న వివిధవస్తువులు,-తళతళ మెరిసేసిలుకులు, పింగాణీ, రాగిపాత్రలు, లోహసామగ్రి, ధాన్యాదులు అన్నీ వున్నాయి అంగళ్ళలో. జీరాడే నీలిగౌనులూ, నల్లటి పుర్రెటోపీలూ ధరించి వణిక్కులు యెండిన పండ్లూ, కమ్మనితావులు వెదజల్లే తేయాకూ, బంగారులాంటి ధాన్యాలూ పట్టి నాదెంచేస్తూ, అడావుడిగా వున్నారు. బేరసారాలు, నవ్వులు, కేకలు, గోలా బజారంతా కోలాహలంగావుంది.

అల్లాంటి దృశ్యంచూసి స్థంభించిపోయేను. ధన ధాన్యాలూ, సంపత్సమృద్ధులూ; బింబాధరలైన సుందర యువతులూ, మత్తెక్కించే వాసన ద్రవ్యాలూ; సౌరియావాళ్ళ పంచరంగుల కోట్లూ; ముష్టివాళ్ళ పీలికలూ, కూలీల చెమట ధారలూ; అంతా కలగాపులగంగా వుంది. కన్నుచెదిరే వింతరంగులు, చెవులు బ్రద్దలయే గోలా! ఎంత నిర్భీతి! ఎంత ఉల్లాసం! ఎంతగడబిడ!

వర్తకులూ, విలువైన దుస్తులు ధరించిన స్త్రీ పురుషులూ, బలిసి పుష్టిగావుండే పిల్లలూ,-వీళ్ళలోనుంచి దారిచేసుకుంటూ పోతూన్నాము. చైనాలో సంపత్సమృద్ధులున్నాయని నమ్మడానికి తగిన అవకాశాలు నా కంతవరకూ లేకనేపోయేయి. ముట్టడులవల్లా, నిరంకుశ ప్రభుత్వాలవల్లా, దోపిడీలవల్లా, అల్లరులవల్లా, వ్యాపారజూదంవల్లా నాశనమైపోయిన పట్టణాలూ, పల్లెలూ మాత్రమే అంతవరకూ కనిపిస్తూవచ్చేయి. నాకు. దారిద్ర్యపీడితమైన చైనాలో సంపత్సమృద్ధమైన యీ పట్టణం యెడారిలో జలపూర్ణమైన సరస్సులా కనిపించింది.

"ఏమిటిది ఉత్సవమా? ఈవేళ యేదైనా పండుగా?" అనడిగేను రికాబుల్లో లేచి నిలబడి.

"అబ్బే! ఏమీలేదు. ఇంకా యీప్రాంతంలో యుద్ధాలు జరగడంలేదు. ఈ పట్టణంలో పటాలాలు లేవు. నగరం, వర్తకుల సిపాయీలచేత కాపాడబడుతూంది." అన్నాడు పాండు నవ్వుతూ.

బజారు చివర మాకోసం కనిపెట్టుకునివున్న నగరసంఘోద్యోగిని కలుసుకుని. గుర్రాలుదిగి ఆయనకు వందనం చేసేము. మావందనాల నందుకుని తనవెంబడే రమ్మని సైగచేసి ముందుకు నడిచేడు. ఆఉద్యోగి. పొడుగాటి కర్రలచివరవున్న కాగితపు లాంతర్లు వెలిగించి పట్టుకుని యిద్దరు నౌకర్లు ముందు నడుస్తూ దారిచూపుతూంటే మేము అనుస రించేము. అచ్చంగా ముందుచూసిన లాటిదే యింకో కర్రవంతెన దాటి వెళ్లేము. అక్కడంతా నిశ్శబ్దమైన గాఢాంధకారం వ్యాపించివుంది. మనుష్యుల గడబిడ యిక్కడున్నట్లే లేదు.

అక్కడి వీధులన్నీ యిరుకుగా, వంకరటింకర్లుగానూ, యెత్తుపల్లాలు గానూ వున్నాయి. వీధుల కిరుప్రక్కలా శిధిలమైన పూరిళ్లూ, నెరలు గొట్టిన మట్టిగోడలూ, చిన్నచిన్న గుడిసెలూ క్రిక్కిరిసి వున్నాయి. మురికీ, పెంటపోగులు, చెత్తాతో ఆ సందుల్లో భరించరాని దుర్వాసనగా వుంది. పెంటపోగులమీద, మురికి గుంటల్లోనూ పడిలేస్తూ, వీధుల్లోనే పడుకునివున్న బిచ్చగాళ్ళనూ, కుక్కల్నీ తొక్కి ఉలికిపడుతూ నడు స్తూన్నాము. మమ్మల్నిచూసి యిద్దరు ముష్టివాళ్లు వెంటపడ్డారు. వాళ్లు లాంతర్ల వెలుగుకు వెళ్ళి తమ ముఖాలమీదా, గుండెలమీదా చీముపట్టి బొప్పుల్లావున్న గాయాల్నీ, పుళ్ళనీ ప్రదర్శించి, ఏమైన యిమ్మని పీడిం చేరు. వాళ్ళని వదిలించుకుని ముందుకు సాగేము. పక్కా గంటవరకూ ఆ గొందుల్లోపడి నడుస్తూన్నా మాకు ఒక్క దీపంకూడా కనిపించలేదు. సందడిగా, సమృద్ధితోవున్న బజారు దాటడానికి పదినిముషాలైనా పట్ట లేదుగాని యీచీకటి సందులు గంట నడిచినా తరగనేలేదు. ధగద్ధగాయ మానంగా వెలుగుతూ, సంపదలతో నిండిన బజారుచుట్టూ మైళ్ళపర్యం తం చీకటి, దారిద్ర్యం, మురికి, దుర్వాసన, దుఃఖం స్థిరావాసం యేర్ప రచుకున్నాయి.

నిజంగా కుప్పతిప్పలుగావున్న వస్తుసంపదలు మేము చూసేమా? అక్కడ వెలుతురూ, సంతోషసౌఖ్యాలూ, కులాసాధ్వనులూ నిజంగా

వున్నాయా? లేక అదంతాకలా? పగలంతా శ్రమపడి వుండడంచేత చిత్తవిభ్రమం కలిగిందా? ఇప్పుడు మాత్రం నాచుట్టూ నల్లని చీకట్లు, కంపరం పుట్టించే దుర్వాసనలు, గుండెలు జలదరింపజేసే దారిద్ర్యం,—యివే వున్నాయి!

"లైలయో!" (మనం వచ్చేము) అన్నాడు మార్గదర్శి.

"మళ్లీ యిక్కడా పట్టణం వెలుపలే బస యిచ్చేరు వీళ్ళు. ఇక్కడైతే మనల్ని బాగా కనిపెట్టి చూస్తూండవచ్చునని వీళ్ళ వుద్దేశం!" అన్నాడు మెల్లిగా నాచెవులో పాండు.

గుర్రం జీనులు విప్పనేనాలేదు, హోల్‌స్టర్లు అసలే లేవు. చివరికి కాలిబూట్లేనా విప్పకుండా అక్కడి గడ్డిచాపలమీద పడి నిద్రపోయేము. క్షణంలోనే గాఢనిద్ర మమ్మావహించింది. నిద్ర సుఖమెరుగదంటారు గదూ?

మర్నాడుదయమే లేచి ముందరివాకిట్లోకి వచ్చేము. అదొక చిన్న తోట. చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ వుంది. చుట్టుపట్ల జనసంచారమేలేదు రాత్రి మేము పండుకున్న దొక దేరా. దానిచుట్టూ యెదగకుండా కత్తిరించిన దొంక గుబురుగా వుంది. దీనికి పట్టణంతో యేమీ సంబంధమే లేదని చెప్పవచ్చును. ద్వారం దగ్గర దుడ్డుకర్రతో పోలీసువాడొకడు పహరా నిలుచున్నాడు. పట్టణంలో విదేశీయులు వచ్చేరనేవార్త ప్రాకి వుంటుంది. మమ్మల్ని చూడ్డానికి వందలకొద్దీ జనం గేటుదగ్గర మూగుతూన్నారు. వాళ్ళని తరుముతూ, దుడ్డుకర్రమకూడా స్వేచ్ఛగా ప్రయోగిస్తున్నాడు, పోలీసువాడు.

అక్కడినుంచి వెనకతిరిగి వెళ్ళి తోటను చూస్తూ నడుస్తూన్నాను. మాగుర్రాలుకూడా చెట్లక్రిందే వున్నాయి. ఒక ముసిలి నౌకరు వాటికి బాల్చీలతో నీళ్ళు పెడుతూన్నాడు. వాని పచ్చని ముఖం అంతా ముడుతలు పడిపోయివుంది. కనుబొట్టలుబ్బి, కళ్ళు నీరుగ్రమ్మి వున్నాయి. వాడు మెల్లగా కళ్లెత్తి నావైపుచూస్తూ నమస్కరించేడు. నేనుకూడా

గుర్రాల దగ్గరకువెళ్ళి వాటిని నిమురుతూ, నాగుర్రం బాల్చీలో నీళ్ళు పోస్తూన్నా. నేను చేసే ప్రతి చిన్నపనినీ, ఆముసలాడు తలవంచుకొనే దొంగచూపులతో కనిపెడుతూన్నాడు. అక్కడ కాస్సేపుండి వెనక్కి తిరిగి పోదామనుకుంటూంటే ఆవృద్ధుడు నాచొక్కా పట్టుకు లాగేడు.

"షీ మోషీ ?" (అదేమిటి ?) అనడిగేను, నేను.

"నీ షీ ఓగోజన్ షీ రూసీ ?" (మీరు రష్యన్‌లా ?)

"షీ డీ." (ఔను) అన్నాను.

దానిమీద అతడేదో చెప్పడం ప్రారంభించేడు. కాని నాకదేమీ తెలియ లేదు. ఆగమని సంజ్ఞచేసి, పాండును కేకేసేను. చాలసేపుదాకా పాండు అతనితో మాట్లాడుతూనే వున్నాడు.

"అతడు యీ తోటమాలి. మీకోవస్తువు చూపించాలంటాడు. నేనెంత తంటాలుపడ్డా ఆవస్తువు వైనం తెలుసుకోలేకపోతూన్నా. బహుశా, అదేదో తాయెత్తు........"

"తీసుకురమ్మను, చూద్దాం."

పాండు నా మాటలాతనితో చెప్పినదే తడవుగా ఆవృద్ధుడు తలూపి, బాల్చీలు పుచ్చుకొని వెళ్ళిపోయేడు.

"సంగతేమిటి ?" పాండును ప్రశ్నించేను.

"నాకూ తెలియలేదు. ఈతని తమ్ముడు షాంఘైలో కలాసీగా పని చేస్తున్నాడుట. తరుచు ఓడలమీద విదేశాలకు పోతూంటాడుట. అటువొక సారి 'టిబెటురాజ్యం' వెళ్ళి, అక్కడనుంచి రక్షరేకులాంటిదేదో తెచ్చే డుట. అది దుఃఖంలోవున్నవాళ్ళని సంతోష పెడుతుందనీ, రోగాలు పోగొడుతుందనీ, దరిద్రులకి సంపదలిస్తుందనీ చెపుతూన్నాడు. ఏమిటీ మహిమలు ?" అన్నాడు సందేహిస్తూ, పాండు.

ఇంతలోకే తోటమాలీ తిరిగివచ్చేడు. ఎవరేనా తనను చూస్తారేమో నని భయపడుతూన్నట్లుగా బిత్తరిచూపులుచూస్తూ వస్తూన్నాడు. నన్ను

సమీపించుతూనే అతిభద్రంగా చొక్కా-క్రిందినుంచి ఒక కాగితపుచుట్ట పైకితీసి, భయభక్తులతో ముందుకుజాపేడు. పాండు దానినందుకుని పైనచుట్టిన కాగితాన్ని విప్పేడు. లోపల ఒక చిన్న పుస్తకంవుంది. దాని అట్ట వెలిసిపోయిన గులాబిరంగుగావుంది. పైన స్ఫుటంగా రష్యన్ భాషలో,-

"శిస్తు వసూళ్ళను గూర్చి"
మాస్కో కార్మిక కర్షక సైనిక ప్రతినిధుల
సోవియటుయొక్క- నిబంధనలు.
1923.

అనివుంది. 'బీదల రాజ్యం' నుంచివచ్చిన తాయెత్తు యిది!

తోటమాలీమేదో మాట్లాడుతూంటే పాండునాతో తర్జుమాచేసి చెపుతూన్నాడు. ఆ తాయెత్తును వుపయోగించే విధానం చెప్పాలిట. ముసలాడికి! ఏమనిచెప్పను? కాని ఓవిధంగా యిదినాకు సంతోషాన్నే కలిగించింది. ఏ సెయింట్ నికోలస్ విగ్రహాన్నోగాక, మాసిపోయినా, పాతగిలిపోయినా యీ కరపత్రాన్నే ఆశతో భద్రంగా చేబట్టేడు వృద్ధుడు. సెయింట్ల విగ్రహాలకు ఏ మహత్తులున్నా లేకపోయినా దీనిలో మాత్రం పీడితులకు దారిచూపగల శక్తివుంది!

సంపదలతో తులతూగుదేశాల్లో మానవులు దేవుణ్ణి సంపన్నుడుగానూ, భోగపరాయణుడుగానూ చేసి, ధూపదీపనైవేద్యాలు, మేలుకొలుపులు, పవళింపుసేవలు, చందనచర్చలు, వైశాఖోత్సవాలు దండిగా చేయిస్తారు. ఎడారుల్లో ప్రజల దేవుళ్లూ, వాళ్ళతరహా, అంతస్థూవేరు; ఊసరవెల్లులే అక్కడ దేవుళ్ళు! ధనికులుంచుకొనే తాయెత్తులు వేరు, దరిద్రుల తాయెత్తులువేరు! ఇది మనకెక్కడా ప్రత్యక్షమే.

పాండును ప్రక్కకి తప్పించుకుని వెళ్ళి వృద్ధుణ్ణి కౌగలించుకున్నాను. ఈ మారుమూల యెడారిలో నా కాతడు సోదరునిలా కనిపించేడు. ఇక్కడికి యుద్ధాలు యింకారాలేదు. కాని యీ నిరుపేదవానికి పేదరికాన్ని పోగొట్టుకోవాలనే వుంది. దానికి సాధనం తాయెత్తేనని అనుకోనీండి. మార్గం అన్వేషించగా దొరక్కపోదు! ఇక్కడీతడు యేకాకిగావచ్చు. కాని జాతిమతభేదాలు, దేశపుటెల్లలు అధిగమించి, మానవులకు వెలుగు చూపే శక్తులు యీ మారుమూలలకు కూడా రానేవచ్చేయి!

*    *    *    *

దాదాపు ఒకసంవత్సరం గడిచిపోయేక యిప్పుడు, చైనాతూర్పురైల్వే మీది ఎక్స్ప్రెస్ పెట్టెలో నేనుచూచిన ఆ రష్యన్ యువతీ, వన్నెతరిగిన సెయింట్ నికోలస్ విగ్రహం మళ్ళీ జ్ఞాపకం వచ్చేయి. రష్యన్లు ఏదో మహాత్మ్యన్ని లోకంమీదికి విసురుతూనే వున్నారు!

నాంకింగ్. 20-9-1926.

# ధర్మ సందేహం.

పసిమి నురగలు గ్రక్కుతూన్న బురదనీరు వంకరగావున్న గట్లను దాసి వేగంగా ప్రవహిస్తూంది. చిఱచిఱలాడుతూన్నట్లున్న ఆకాశం తెల్లటి మేఘమాలికలతో చాందినీ కట్టుకుంది. నదీతీరాన్నేవున్న రేవుల్లో ప్రత్తి పేళ్లను దింపుతూ పడవలు పోతూన్నాయి.

రోడ్డంతా బురదగా వుంది. బండిగాళ్ళలో నీరునిలచి, చెదరుతూ నడిచేవాళ్ళ బట్టలు ఖరాబుచేస్తూన్నాయి. అర్థనగ్నులైన కూలీలు వీపుల మీద పెద్దపెద్ద ప్రత్తిపేళ్ళను మోస్తూ, నగంక్రృంగి, శల్యాకృతులతో పరుసలుగా నడిచిపోతూన్నారు. వీళ్ళతోపాటు పడవ కళాసులుకూడా ప్రత్తి పేళ్ళు మోస్తూ ఊతానికి యేలపాటలు పాడుతూన్నారు.

"ఓహోహో ! ఏహేహే ! ఈహీహీ !

పేళ్ళనీ ఒకే ప్రవాహంగా వార్ఫుమీదుగా వచ్చి రోడ్డుచివర వున్న ఫ్యాక్టరీలో యింకిపోతూన్నాయి. ఎఱ్ఱయిటుకలతో కట్టిన యీ ఫ్యాక్టరీ పెద్దభూతంలాగ కనిపిస్తూంది. ఫ్యాక్టరీపైన నల్లటిపొగ మేఘాల్లో చారల జండా ఒకటి మెల్లిగా యెగురుతూంది. చిన్నపిల్లలు వీపులమీద వెదురు బుట్టలు కట్టుకుని, వాటిలోకి రోడ్డుమీద పడివున్న దూదిపింజల్ని యేరుతూన్నారు. ఆఫ్యాక్టరీ ఆకలితీర్చడానికి అర్భకులైన పిల్లలెందరు పని చేస్తే చాలుతుంది? మధ్యాహ్నం కావచ్చింది. ఎండ నిప్పులు చెరుగుతూంది. పనిచేసిచేసి అలసిన పడవకళాసులు రోడ్డు ప్రక్కల చెట్లక్రింద కూలబడ్డారు. తెల్లవారుఝామునుంచీ అవిరామంగా పనిచేస్తూన్నారేమో వాళ్ళశరీరాలు చెమటతో తడిసి ముద్దయిపోయేయి. చెమటతో తడిసిన బనియనులు విప్పి పిండుకుంటూ, ఫ్యాక్టరీ గేటులోకి ఒకటే ప్రవాహంగా పోతూన్న ప్రత్తి పేళ్ళవైపు వెర్రిచూపులు చూస్తున్నారు, కూలీలు. ఆప్రదేశమంతా కేకలూ, మూలుగులూ, ఒగర్పులూతో నిండిపోయింది. విధీ విరాములేకండా ఒకటే పాటపాడుతూ, పసువులకన్నా యిబ్బడిగా బండ

చాకిరీ చేస్తూన్న కూలీల పాటు చూడ్డానికీ, ఒగర్పులు వినడానికీ బాధకలి గిస్తూన్నాయి

"ఓహోహో! ఏహేహే! అహోలీ! ఈహీహీ!"

మట్టితో కట్టిన గుడిసెలు రోడ్డుకు రెండువైపులా వందలకొలదిగా క్రిక్కిరిసివున్నాయి. కూలీలకి గుడిసెలే, మురికికూపాలే మేడలూమిద్దెలూను! ఒక్కదానిలో మూడునాలుగు కుటుంబాలు కూడా కాలక్షేపం చేస్తుంటాయి. తూర్పువర్షాలు కురిసేరోజుల్లో యీ గుడిసెలన్నీ తడిసి, నాని, కూలిపోయి, మొలలోతునీటిలో వుంటాయి. వరదలరోజుల్లో యెన్నో గుడిసెలు ఆనవాలుకూడా లేకండా కొట్టుకుపోతాయి. వరదలు కొంచెం తిగ్గగానే మోకాల్లోతు ఊబిలోంచే, మళ్ళీ కూలీకుటుంబాలన్నీ ఆనవాలైనా కనిపించని యీ గుడిసెల్లోకి చేరుకుంటాయి. అంతా చిందర వందరగా చెమ్మగావుంటుంది. పాపం! రోజుకు రెండుపూటలా పట్టెడన్నంకి కూడా కరువే. ఆకలితో యేడ్చియేడ్చి, పొట్టలుబ్బి, సొమ్మసిలిపోయి పడివున్న పిల్లలకు రోజుకు ఒక్కసారి యింతగంజి కాచిపోయడమే గగనం. లోతుకుపోయిన కళ్లూ, వంగిన నడుములూ, కృంగి కృశించిన శరీరాలూ, బట్టతలలూ వాళ్ళూ ముసలమ్మల్నీ చూసిన వాళ్లకి మృత్యదేవత వెక్కిరిస్తూ ప్రత్యక్షమైనట్లే వుంటుంది. ఈ కుటుంబాలన్నిటికీ, యేటికేడాది పొడుగునా, ఏదో ఒకటే అన్నాధరువు. వరిఅన్నం, దాంట్లోకి బీటుదుంపలతోనో కేబేజి ఆకుతోనో చేసిన పులుసు. దేవతల ప్రీతికై కాగితపువత్తులెన్నీ వెలిగించి పెడుతూన్నా, ఆ దేవతల కీ విరు పేద నిర్భాగ్య కష్టజీవులమీద కొంచెమేనా అనుగ్రహం కలిగినట్టే కని పించదు. కూలీపేటల్లోని వీధులుకూడా వాళ్ళ బ్రతుకుల్లాగే వున్నాయి. వీధులన్నీ సన్నగా, వంకరటింకర్లుగా, యెక్కడచూసినా పేడతోటీ చెత్తతోటీ నానాఅసహ్యంగానూ వున్నాయి. బక్కచిక్కిన పిల్లలు నగ్నరూపాలతో బురదవీధుల్లోనూ, పెంటకుప్పలమీదా గంతులేస్తూ ఆడుకొంటూ న్నారు. వీధుల్లో పారేసిన విస్తళ్లలోని మెతుకులకోసం కుక్కలతో

పోట్లాడి, లాక్కొని తింటూండే వీళ్ళకూ రోజులు అదోకలా గడిచి పోతూనే వుంటాయి. అడపదడప యెవరేనా కొత్తవాళ్ళు రోడ్డుమీద పోతూంటే, వాళ్ళవెంబడిబడి దీనంగా యేడుస్తూ కానీ యేగాణీ అడుక్కుంటూంటారు. పాంథులవెంట పిల్లల గుంపులు గుంపులుగా వచ్చి,

"టాజన్! కైషో! టాజన్! కైషో! " (బాబయ్యా! ఇప్పించండి!)

అనో, లేదా "టూ అ, టూ ఏ" అని ముష్టిపాటలు పాడుతూ చుట్టుకుంటారు. అబ్బా! హృదయం అంటూవుంటే కరిగి నీరైపోవాల్సిన ఘట్టాలు. కాని, స్వార్థపరత్వం మనలోని మానవత్వాన్నే రూపుమాపినప్పుడు?

కూలీలపేటను తాసుకునే జపాన్‌వాళ్ళ బట్టలమిల్లు వుంది. కూలీల గుడిసెల్లోంచి వచ్చేపిల్లల యేడ్పులూ, మిల్లులోకి ప్రత్తిబేళ్ళు మోసే కళాసుల 'ఏలేసా-వేలేసా'లూ కలిసి ఒక వింతశృతిలో పడుతున్నాయి.

ఈ ఆలాపన ఫ్యాక్టరీగోడల లోపల్నుంచి ప్రతిధ్వనురీసుతూంది. మిల్లులోపల దారపుకదుళ్ళు బజ్‌జ్‌మని ధ్వనిస్తూ తిరుగుతున్నాయి. చక్రాలమీద బెల్టులు ఫస్స్-ఢష్ మంటూ అతివేగంగా తిరుగుతున్నాయి. ఈలలువేస్తూ ఆవిరియింజన్‌లు బస్-బస్ అంటున్నాయి. ఫ్యాక్టరీలోంచి యీశబ్దాలూ, బైటనుంచి ఆ ధ్వనులూ కలిసి శృతిమించి రాగాన పడుతున్నాయి. కూలీల శాశ్వతబానిసత్వం, దుర్భరదారిద్ర్యం, యంత్రాల బ్రహ్మాండశక్తి, పెట్టుబడిదారుల అత్యాశ,—వీటిగాథల్నే పాడు ందా? అనేటట్లు తోచింది మాకు, యీ ఆలాపన వింటూంటే.

ఫ్యాక్టరీ దగ్గరలోనేవున్న వార్ఫుమీద కూర్చుని రేవు నావకోసం యెదురుచూస్తున్నాము. రేవుదాటితే యూరోపియన్‌ల సెటిల్‌మెంటు వుంది. త్రైహోసిన్ మాదగ్గరే కూచుని వెనకటి వృత్తాంతాన్ని యేకరువు బెడుతున్నాడు. మావెనుకనుంచి కూలీపేటలోనిగోలా, ముందునుంచి ఫ్యాక్టరీహోరూ మేళవించి త్రైహోసిన్ అమాయికగాథకు శృతివేస్తూంది.

"........నాస్వగ్రామం యిక్కడికి నాలుగువందల 'లీ' లు దూరంలో నది యెగువన వుంది. మాప్రాంతాల్లో నీటిసదుపాయా లంతగా లేక పోడంవల్ల వరిపంట బాగాపండదు. హూచౌ, షాంఘై నగరాల్లో పెద్ద పెద్ద మిల్లులూ, ఫ్యాక్టరీలూ బైలుదేరడంతో మాప్రాంతాలలోని రైతు లంతా ప్రత్తిపంటనే వేయసాగేరు. నాచిన్నతనం నాటికే మావూరంతా ప్రత్తిచేలతో నిండిపోయి వుండీది. ఆకురాలు కాలంలో ప్రత్తికాయలు పక్వమై విచ్చి తెల్లని ప్రత్తి పైకి వచ్చినపుడు యెక్కడా ఆకులేనా కని పించీవికావు. చేలన్నీ తెల్లగా పిండి ఆరబోసినట్టుగా వుండీవి."

"మాగ్రామపెద్ద ప్రైస్. ఊళ్లో భూమి చాలమట్టుకు ఆతనిదే. మిగిలిన కొద్దిభూములు ఐనా అతని దగ్గరబంధువులు కొద్దిమందివే. ప్రైస్ యెప్పుడూ పట్టణంలోనే వుంటాడు. అక్కడి పెద్దవర్తకులలో అత నొకడు. ఊళ్ళో భూములన్నీ రైతులకి అమర్చుకుని, ప్రైస్ పట్టణంలో వ్యాపారం చేసుకుంటూండేవాడు."

"నాచిన్నతనంలో నేనూ, అమ్మాకూడా మామేనమామగారింట్లో వుండేవాళ్ళం. అతని పొలాల్లోనే చాకిరీ చేస్తుంటే, అతడే మాకింత కూడూ గుడ్డా యిచ్చి పోషిస్తూండేవాడు. మానాయన పడవలమీద కళా సుగా పనిచేస్తూండీవాడు. వర్తకుల ప్రత్తిబేళ్లూ, యితరసరుకులూ వేసు కుని, నది పొడుగునా ఒక వూరునుంచి మరోవూరుకు పడవ తీసుకు పోతూండేవాడు. ఎల్లాగో కాస్తడబ్బు కూడబెట్టుకుని రెండెకరాలు మడి కొనుక్కుని, స్వంతగుడిసె నిలబెట్టుకుని, కుటుంబంతో స్థిరపడదామని నాతండ్రి ఆశ. రైతులందకీ యిది సహజమేగదా! కాని దురదృష్టదేవత మమ్మల్నెప్పుడూ వెంబడిస్తూనే వుండీది. నాన్నకి పనిలేకపోవడమో, మాగుడిసె, గట్రా పరిశురామప్రీతి అవడమో, బేళ్లు మోసేటప్పుడు కాలు బెణికి కదల్లేక రెండుమూడు నెలలు మూలపడుండడమో,—యేదో ఒక అవాంతరం వస్తూనే వుండేది."

"నాకు పదిహేనేళ్ల వచ్చేసరికి మాకుటుంబానికి తీరనిదెబ్బ తగిలింది. ఆరోజుల్లో కలరా వ్యాపించి దేశం అంతా పురుగునాకేసింది. ఆపాడు వ్యాధే మాఅమ్మనుకూడా పొట్టబెట్టుకుంది. నాకింకా యీడులేనందున అంతగా పనిపాటులు చేయలేనని మా మామ నన్ను పోషించడానికి అంగీకరించలేదు. ఇంక చేసేదేమీ లేక మానాన్న నన్ను తీసుకుని పట్ట ణానికి వచ్చేడు."

"ఇదుగో! ఈవార్ఫుమీదే మేము పడవదిగేము. ఎనిమిదేళ్ల కావచ్చిం దప్పుడే. మా ప్రాంతాలవాళ్లు చాలమంది బట్టలమిల్లులో పనిచేస్తున్నారు. వాళ్ళద్వారా నాకుకూడా మిల్లులో పని సంపాదించాలని మాతండ్రి యత్నించేడు. అదుగో! ఆకనిపించే హోటల్లోనే మాబంధువులందరికీ అప్పుడు చిన్నవిందు చేసేడు, నాన్న. మాబంధువులందర్నీ పిలిచేడు. ఒక్కొక్కరేవచ్చి చేరినతర్వాత విందు ప్రారంభమైంది. బియ్యపుసారా గ్లాసుమీద గ్లాసు అతిధులు ఖాళీచేస్తున్నారు. ఇరవై యో కప్పు ఖాళీ అయే టప్పటికి నా భవిష్యత్ నిర్ణయించబడిపోయింది. మాయింటిపేరిటివాడే, మైన్ టా చో అనే మాదూరబంధువు యిక్కడి మిల్లులో మెకానిక్‌గా పనిచేస్తూన్నాడు. అతడు నన్ను తనక్రింద అసిస్టెంటుగా తీసుకుంటా నన్నాడు."

"ఇది జరిగిన కొద్దిరోజులలోనే మాతండ్రి పడవమీద నది యెగు వకు సరుకు తీసుకుని వెళ్ళిపోయేడు. వెళ్లేముందు నాకు బుద్ధులుచెప్పి, వదలలేక వదలి వెళ్లేడు. మైన్ టా చో మాటవింటూ జాగ్రతగా వుండ మనీ, ఎవరితోను పోట్లాటలు పెట్టుకోవద్దనీ, యింకా యెన్నెన్నో నీతులు చెప్పి, మాకులపెద్ద మైన్ దగ్గరకు తీసుకు వెళ్లేడు. అతడు ధన వంతుడు, వర్తకుడు. మమ్మల్ని చూడ్డానికే తీరుబడి లేకపోయిందాతనికి! మాకాతని దర్శనం లభించకపోయినా, నాన్న కొంతడబ్బు మూటగట్టి, కులపెద్దల స్మారకార్థంగా కట్టుతూన్న దేవాలయం కోసమని అక్కడ

సమర్పించి లేచి వచ్చేడు. 'కలిపోసినా ఉట్టివంకే చూసేడ'న్నట్లుగా, బైస్ప్ మాకు దర్శనమేనా యివ్వకపోయినా యేదైనా ఆపత్సమయంలో అతని దర్శనంచేసి, సాయంకోరమని మానాన్న నాకు హితవుచెప్పేడు. "బైస్ప్ మనకులపెద్ద; రక్షకుడు; ఆపత్సమయాల్లో అతడే మనకు దిక్కు." అంటూ మానాన్న నన్ను వదలలేక వదలి వెళ్ళిపోయేడు."

"మాతండ్రి పూర్వకాలపు మనిషి. కుల సాంప్రదాయాలూ, కుటుంబ బాంధవ్యాలూ అతి పవిత్రమైనవనీ, వాటిని జాగ్రతగా కాపాడుకుంటూ వుండాలనీ నమ్మతూ, నన్నుకూడా పూర్వసాంప్రదాయాల్లో విశ్వాసం గలవాణ్ణి చేయాలని తాపత్రయపడుతూండేవాడు. ఇక్కడ పట్టణంలో మాప్రాంతీయుల సంఘం ఒకటుంది. అందులో పలుకుబడిగల పెద్దల ప్రాపకం గనక సంపాదిస్తే యింక దేనికీ భయపడాల్సిన పనిలేదని మానాన్న నాకెప్పుడూ హితపు చెబుతూండేవాడు.

"అదే మా యిద్దరికీ కడసారిచూపు ఐపోయింది. నదిమీద తరుచుగా ప్రమాదాలు తటస్థిస్తూనే వుంటాయి. అట్టిదే మా నాన్ననీ దిగమ్రింగేసింది. ఒకనాటిరాత్రి కటికచీకట్లో విదేశీయులనౌక ఒకటి మా నాయన పడవను ఢీకొని ముంచేసింది. పడవకళాసుల్లో కేవలం ఒక్కడుమాత్రం బ్రతికి బైటపడ్డాడు. పడవ దెబ్బతినగానే పడవమీదివాళ్ళందరూ ఢంకాలు మ్రోగించీ, తారాజువ్వల్నీ-మతాబుల్నీ వదిలీ, యెన్నో పాట్లుపడ్డారుట. కాని యీ అపాయసూచనల్ని యేమీ లక్ష్యపెట్టకండా ఆ విదేశీయులు ఓడ నడుపుకుపోయేరు. చీనాకూలీల ప్రాణాలు యెవరికి లెక్క? పడవ మునుగుతూంటే వాళ్ళకి సాయంచేసేవాళ్లెవరూ లేకపోయేరుట. వాళ్ళ శవాలు కూడా దొరకలేదు. అంచేత వాళ్ళకి మృతసంస్కారాలు చేయడానికి కూడా అవకాశం లేకపోయింది. నా తండ్రి సమాధిమీద దోసెడు మట్టి పోసి పితృఋణం తీర్చుకోజాలకపోయేను.. ఈ కఠోరవిశాల ప్రపంచంలో యేకాకిగా మిగిలిపోయే నదిమొదలు. రెక్కలే నాకు ఆధారం.

"మిల్లు మెకానిస్టూ, మా కులంవాడూ ఐన బ్రైస్ క్రింద నేను పని నేర్చుకుంటూ వుండిపోయేను. ఇంజనులు తుడవడం, నూనెపోయడం నా పనులు. సాయంత్రం ఆరు లగాయితు తెల్లవారి ఆరుగంటలవరకూ మావంతు. అప్పటికి పగటి జట్టువాళ్లు వస్తారు. ఇంజన్‌గది యెంతో వేడిగాను, ఉక్కగానూ ఉండేది, కాని ఆ పరిస్థితులకు క్రమంగా అల వాటు పడ్డాను. నా తెలివితేటలకీ, చురుకుతనానికీ, నేర్పుకీ, బ్రైస్ టాచో చాలా మెచ్చుకొనేవాడు. ప్రతి విషయంలోనూ అతనికి చేదోడుగా వుంటూండేవాడిని, మెకానిస్టు బ్రైస్‌కే గాక మా యింజన్‌గది చూడ్డానికి తరుచుగా వచ్చే జపాన్ ఓవర్‌సీర్‌కు కూడా కొద్దిరోజుల్లోనే అభిమాన పాత్రుడనయేను.

బ్రైస్ టాచో ధర్మమాయని నేను మంచిపనిలోనే పడ్డానని గ్రహించ డానికి నాకాట్టే కాలంపట్టలేదు. పత్తి బాగుచేసే పనిలోనూ, స్పిన్నింగ్ శాఖలోనూ, వీవింగ్‌లోనూ పనిచేసే కుర్రాళ్ళనీ, ఆడపిల్లల్నీ బట్టి చూస్తే నాపని చాలా నయం. నాకువచ్చే జీతమంతనూ నా తిండికీ, బట్టలకీ తీసుకుంటూండేవాడు, బ్రైస్ టాచో. అసలు నాకు జీతమెంతో కూడా తెలియదు. కాని కొద్దిరోజుల్లోనే మెకానిక్‌గా తరిఫీదుపొంది, రోజు కొక డాలరు జీతంతీసుకుంటూ, మెకానిక్స్ ట్రేడ్ యూనియన్‌లో సభ్యుణ్ణ వుతానని అంతా అంటూండేవాళ్ళు.

"కాలక్రమేణా నేనూ మెకానిక్ నవుతాను. ఈ ఊహతో నాలో గర్వం అంకురించింది. ఇతరకూలీలంటే కొంచెం చిన్నచూపుచూడ నారంభించేను. సామాన్య కూలీలకు దూరంగా వుండడం, మేస్త్రీలు, ఫోర్మన్‌లు, జపాన్ ఓవర్‌సీర్‌లూ వీళ్ళతో కలిసి వుంటూండడం కూడా ప్రారంభించేను.

"అప్పటికి నేను మిల్లులోచేరి ఒకసంవత్సరం కావచ్చింది. ఓరోజు యిద్దరు నేతపనివాళ్ళు మా యింజన్ గదిలోనికేదో పనిమీద వచ్చేరు.

ఎల్లా వచ్చిందో తెలియదుగాని వాళ్ళిద్దరికీ పేచీవచ్చి పోట్లాట ప్రారంభిం చేరు. జపాన్ ఓవర్‌సీర్‌ని పిల్చుకురమ్మని ప్రైస్ నన్ను పంపించేడు. నేనూ వెళ్ళి ఆఫీసులోవున్న ఓవర్‌సీర్‌ని మా సెక్షన్‌కు పిలుచుకొచ్చేను. పోట్లాడుకుంటూన్న కార్మికుల్ని రెండు కొరడాదెబ్బలతో విడదీసి, వాళ్ళిద్దరి నెంబరులు, పేర్లూ పుస్తకంలో రాసుకుంటూన్నాడు. జపానీవాడు. ప్రైస్ వాడి దగ్గిరికి వెళ్ళి యేదో గుసగుస లాడేడు. దాంతో వాడు మా కులంవాడి నెంబరు గీతపెట్టి, రెండోవాణ్ణి బైటకు వెళ్ళగొట్టేడు.

"నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఈ తగువుకంతకూ కారకుడు మా కులంవాడే నని నాకు బాగా తెలుసు. ఆ రెండో నేతకార్మికుడు పాపం, అమాయకుడు. వయస్సుకూడా యెంతో వుండదు. కాని పైకి నేనేమీ అనలేదు. ఈ పని తీసేసిన తర్వాత వాడికింకేపనీ దొరకలేదు. ఎంతో బాధపడుతూండేవాడు. తెల్లవారేసరిగి వాడు మిల్లుగేటు దగ్గరకు రావడం, కాపలావాళ్ళు లాఠీలతో మోరంగా తరిమికొట్టడం, యిది నిత్య కృత్యమైపోయింది. కొద్దిరోజుల్లోనే అతడు బక్కచిక్కిపోయేడు. అతడి బట్టలు చిరిగి పీలికలైపోయేయి. పనులులేని కూలీలందరితోబాటు అతడూ మిల్లు గోడలప్రక్కనే రాత్రులన్నీ గడిపేవాడు. ఏషిఫ్టులోనేనా పనిదొరుకుతుందని వాళ్ల ఆశ. పాపం! అతన్ని చూసినప్పుడల్లా నేనేదో మహాపరాధం చేసినట్లు నా అంతరాత్మ పీడిస్తూండేది. అది శీతాకాలం. ఆ రోజున రాత్రంతా పనిచేసి, తెల్లవారి బైటికి వస్తూన్నాము. ఆ యువకుడు మిల్లుగేటుకు యెదురుగా వున్న చెట్టుకు వురిపోసుకుని చచ్చి వ్రేలాడుతూన్నాడు. ఆ దృశ్యం నాకిప్పటికీ కళ్ళకి కట్టినట్లుంది. అతని చావు నా కొక పెద్ద అఘాతంగా తగిలింది. నాతప్పు అంగీకరించి పశ్చాత్తాప పడేవాడినే. కాని యితర కూలీలంతా అతని చావుకు నేనే బాధ్యుణ్ణని నిందించడంవల్ల నాలోని అహంభావం రెచ్చిపోయి, నా లోపాన్ని అంగీకరించలేకపోయేను. పైగా నా చర్యను సమర్థించుకోనారంభించేను. కార్మికులంతా నన్ను మరీనిందించి, ఓవర్‌సీర్‌కు పెంపుడుకుక్కనసీ

యింకెన్నో నీచమైన పేర్లుపెట్టి నన్ను వేళాకోళాలు ప్రారంభించేరు. దాంతో నేను కూలీలకు మరీ దూరంగా వుండనారంభించేను.

"ఈ విధంగా మూడేళ్ళు గడిచిపోయేయి. నా అప్రెంటిస్ పని యించుమించు పూర్తికావచ్చింది. ఇంజన్ల వ్యవహారమంతా అప్పుడప్పుడు నేనే స్వయంగా చూసుకుంటూన్నాను. ఇంజన్‌గదిలో ఓమూల మైస్త్రీ కునికిపాట్లు పడుతూ కూర్చునేవాడు. నేను యింజన్‌లు నడుపుతూండేవాణ్ణి. నా బంధువుడు మైస్త్రీ సహాయంవల్లా, నా వినయవిధేయతలవల్లా, కష్టపడి పనిచేసి యీవిశాలప్రపంచంలో నాకుకూడా ఒకస్థానం నిర్మించుకోగలిగేనని తృప్తిపడేవాడిని. కాని యింతలోనే కథ అడ్డం తిరుగుతుందని యెవరనుకున్నారు? ఒక విపరీత సంఘటన నాభావార్నీ, అలవాట్లనీ కూడా పూర్తిగా తారుమారు చేసేసింది.

"ఆ సంవత్సరం అనావృష్టివల్ల పంటలు నాశనం ఐపోయేయి. అంతా కరువుగావుంది. ధాన్యం ధరలు పెరిగిపోయేయి. రోజురోజుకూ ప్రత్తిధర మందం ఐపోతూంది. ఎందరో రైతులు, ఆడవాళ్లూ, పిల్లలూ కూడా పనులులేక, తిండికి దొరక్క మలమల మాడుతూ పట్టణాలకి చేరుకుంటున్నారు. ఏమిల్లులోనో, ఫ్యాక్టరీలోనో, ఏదో పని దొరక్కపోతుందా? అని వాళ్ళ ఆశ. పాపం, రాత్రులంతా మిల్లు గేట్లప్రక్క గుంపులు గుంపులుగా నిలుచునే గడిపేవాళ్ళు. ఏదో నాలుగు డబ్బులు గడించుకుని, సంవత్సరాది నాటికి యేలాగైనా యీనాందార్ల శిస్తులు చెల్లుపెట్టి, పొలాలు నిలుపుకొందామని వాళ్ళ ఉద్దేశ్యం. కాని ప్రత్తిధరతోబాటు పనులూ మందగించినాయి. మిల్లులో అదివరకున్న కార్మికుల్నే తీసేస్తూంటే కొత్తవాళ్ళకి పనులెక్కడ దొరుకుతాయి? ఎందరో కార్మికులు బికారీలూ ముష్టివాళ్ళూ ఐపోతూన్నారు. కూలిరేట్లు పడిపోయినాయి. బియ్యంధర పెరిగిపోయింది. కార్మికుల్లో అసంతృప్తీ చిరాకూ పెచ్చుపెరిగిపోతున్నాయి."

"పనిచేస్తూండే వేళల్లో అప్పుడప్పుడు నేను స్పిన్నింగ్ శాఖలోకి వెడుతూండేవాడిని. పనికిరాని దారపుచిక్కు తెచ్చుకుని యింజన్లు తుడవటానికి వుపయోగించే వాళ్ళము. ఆదినం తెల్లవారవస్తూంది. మాపనులు కట్టిపెట్టేవేళ కావచ్చింది. ఆ సమయంలో నేను స్పిన్నింగు డిపార్టుమెంటులోకి యేదో పనిమీద వెళ్లేను. ఎలక్ట్రిక్ దీపాలుకూడా మబ్బుగా వెలుగుతూన్నాయి. ప్రత్తిలోంచి యెగిరే దుమ్మూ ధూళీ అంతా గాలిలో వ్యాపించడంచేత మరింత మసకగావుంది. ఆహాలులో చెమటవాసన భరించరానిదిగా వుంది."

"స్పిన్నింగ్ సెక్షనులో పనిచేసేవాళ్ళంతా ఒక్కొక్క మిషన్ముందు వాళ్ళవాళ్ళకు సరిపడేలా అమర్చిన కదుళ్ళదగ్గర నిల్చుని పనిచేస్తుంటారు. వాళ్ళలో చాలమంది చిన్నపిల్లలు, ఆడాళ్లూను. దారాలు తెగిపోయినప్పుడల్లా వాటిని జాగ్రతగా పట్టుకుని ముడిపెట్టడం వాళ్ళపని ఏమాత్రం యేమరిపుండడానికిలేదు. మిషనులన్నీ విసుగూ విరామం లేకుండా గిర్రున తిరుగుతూ, మురికిగావున్న దూదినంతా యేకి సన్నటియేకుగా తయారు చేస్తున్నాయి. మిషన్లక్రిందా, మూలల్లోనూ, ప్రత్తి ప్రోగుల మీదా యెందరో పసిపిల్లలు ఆడుకుంటూ, పాకుతూ, నిద్రబోతూ వున్నారు. మరీ చంటిబిడ్డలు వెదురుపేళ్ళబుట్టలలోపడి నిద్రిస్తూన్నారు. అన్నిదిక్కుల్నించీ బొడిదగ్గులు వినిపిస్తూన్నాయి. పసారాల్లోంచి కుర్రాళ్ల దారపుకదుళ్ళ తట్టలు భారంగా మోస్తూ అటూ యిటూ నడుస్తూన్నారు. పిల్లలూ, ఆడవాళ్లూ విరామంలేని పన్నెండుగంటల పనితో ప్రాణం చాలొచ్చి, పీనుగుల్లా ఐపోయి, బూడిదకొట్టుకొన్న దేహాలతో సోలి వున్నారు. మిషన్లహోరు, కదుళ్ళ బజ్ జ్ శబ్దాలూ, ఆ హాలులోని ఉక్క, చెమట, దుర్వాసనా, మసకగావున్న వెలుతురు,-యివన్నీ నరాల్ని క్రుంగదీస్తూంటే వాళ్ళు తూలిపోతూన్నారు.

"మిషనులమధ్య నుండే సన్నటి యిరుకుదారినే నడుస్తున్నా. సన్నటి కొరడాపట్టుకొని నాకెదురుగా జపాన్ ఓవర్సీర్ వసూ కనిపించేడు.

ఓమిషన్ దగ్గర ఆగి, తెల్లగా పాలిపోయివున్న పదేళ్ళకుర్రాణ్ణి పరీక్షగా చూడనారంభించేడు. జపాన్ వాడు. ఆ పిల్లవాడు నిద్రనాపుకోలేక, తెగిన దారాల్ని అతుకుపెట్టక జోగిపోతూన్నాడు. నేనూ యాంత్రికంగానే నడిచి వెళ్ళి ఆ ప్రక్కనే నిలుచున్నాను. ఓవర్‌సీర్ కొరడా గాలిలో పైకి లేచింది. నాకళ్ళు చీకట్లు గ్రమ్మినాయి. ఛెళ్లుమని దెబ్బవినిపించింది. ఆ పిల్లవాడు కెవ్వుమనే కేకతో క్రిందపడిపోయేడు. వాడికేకకి హాలంతా మారుమ్రోగింది. కూలీలంతా కంగారుగా, ఆదుర్దాగా మూచుట్టూ మూగి పోయేరు.

"ఆ పిల్లవాడు నేలమీద బోరగిలా పడిపోయివున్నాడు వాని రెండు చేతులూ ముఖాన్ని కప్పివేసివున్నాయి. ఒకకార్మికుడు వాణ్ణి లేవదీసి, పొదివి కూర్చోబెట్టగానే, మరొకస్త్రీ ముందుకువచ్చి వాని ముఖంమీది నెత్తురు తుడిచింది. అబ్బా ఆదృశ్యం చూడలేక పోయేను.

"పిల్లవాని వంటిమీద స్మారకంలేదు. చచ్చిపోయినట్లుగా కొయ్యబారిపోయివున్నాడు.

"ఆడకూలీలంతా రోషంతో జపాన్ వాడిమీద విరుచుకుపడ్డారు, వాడు పారిపోడానికి యెంతో ప్రయత్నంచేసేడు. కాని అమాంతంగా వాడిమీద పడి కొరడాలాగేశారు. ఎట్లో తప్పించుకుని పరుగు లంకించుకున్నాడు. ఆడకూలీలంతా వాణ్ణి తరుముతూ, నూలుకదుళ్ళూ, పింగాణిపాత్రలూ, రెంచీలూ, చేతికిదొరికిన వాటితో కొడుతూన్నారు. జపాన్ ఓవర్‌సీర్ పరుగెత్తుతూనే రివాల్వరు తీసి గుంపుమీదికి కాల్చేడు. వరాండాల్లోకి ఆడకూలీలూ, పిల్లలూ, అంతా పనులు మానేసి పోగయ్యేరు. చాలమంది ఆడకూలీలు యితర డిపార్టుమెంట్లకి పరుగెత్తి, కేకలు ఆరంభించేరు.

"పనులు మానేయండి! తక్షణం మానండి!"

"ఇదంతా చూస్తూన్న నాకూ ఉద్రేకంతో ఒళ్లు తెలియలేదు. ఇంజన్ లున్న హాలులోకి ఒక్క పరుగున పోయేను. ఇంజన్ దగ్గర నిలుచున్న

జైన్స్ నా రోమ [illegible] [illegible] [illegible] చేస్తూ కాళ్ళచేతుల్ని [illegible] యింజన్‌లను ఆపేసేను. [illegible] పెట్టెలూ, మిషన్లూ క్రమంగా వేగంతగ్గిపోతూ టపటప కొట్టుకొని ఆగిపోతూన్నాయి. జైన్స్ మొట్టమొదట్లో నిశ్చేష్టుడై, విస్తుబోయి చూస్తూ నిల్చునిపోయేడు. గ్రుక్కమిటకరించి వెర్రివానిలా నావైపుచూసి చూసి, తటాలున స్మారకం తెచ్చుకున్నట్లై నాదగ్గరకొచ్చి లాగుట ఆరంభించేడు. నేను వానితో పెనుగులాడుతున్నా. ఆతడున్నట్లుండి నాకంఠంముడి పట్టుకుని నొక్కేస్తూన్నాడు. ఉక్కిరిబిక్కిరవుతూనే మోకాలుతో వాడి డొక్కలో ఒక్కపోటు పొడిచి త్రోసేసి, వాడి పట్టు విదిలించుకున్నాను. వాడూ అంతతో వదల్లేదు. కొంచెం సర్దుకుని మళ్ళీ నామీదికి తుపాన్‌లాగా విరుచుకుపడ్డాడు. నాకూ వళ్ళు తెలియలేదు. ఇంజన్‌దగ్గరవున్న స్టూల్‌ను పైకెత్తి బలంకొద్దీ జైన్స్ నెత్తిమీద విసిరికొట్టేశాను. దెబ్బతిని, వెనక్కి తూలుతూ పోయి, ఓప్రక్కగావున్న బొగ్గుగుట్టమీద స్మృతి తప్పి చాపచుట్టుగా పడిపోయేడు."

"సరిగ్గా ఆసమయంలోనే నా వెనకనుంచి కేక వినిపించింది: సెభాష్! మంచిపనిచేశావ్, కామ్రేడ్!"

"నేను వెనకతిరిగి చూద్దునుగదా పగటిడ్యూటీ యింజనీర్ నిలబడి వున్నాడు. మమ్మల్ని రిలీవ్ చేయడానికి వచ్చి జపాన్‌వాణ్ణి తరమడం, జైన్స్‌తో నాజగడం అన్నీ చూసి వుంటాడు. అతడు గబగబావచ్చి నన్ను దగ్గిరికి తీసుకుని యెంతో అభినందించేడు. తన అసిస్టెంటును కేకలు వేసి పిలిచి, ఫ్యాక్టరీ ముంగిట్లోకి పరుగెత్తి పోయేడు. నేనూ యింజనీర్‌ను అనుసరించేను. అప్పటి కప్పుడే చాలమంది కార్మికులూ, ఆడకూలీలూ, పిల్లలూ అక్కడికి చేరివున్నారు. పిల్లల ఏడుపులు, తల్లుల్ని అంటిపెట్టుకునివున్న పసిబిడ్డలగోల, గందరగోళంగావుంది. ఎవర్ని చూసినా జపాన్‌వాళ్ళని తిట్టేవాళ్ళే. మొగాళ్ళంతా ఒకరొకరితో గుస

గుసలాడుతూ ఉద్రేకంతో తిరుగుతూన్నారు. పగటిషిఫ్టు కూలీలంతా అప్పటికే వచ్చిపడ్డారు. పనులు లేక తిరుగుతూన్న రైతులూ, రేవుకళాసులూ మాతో చేరిపోయేరు. ఇసుకవేసినా రాలకుండా హాకిలంతా ఒకటే జనసమూహం."

"పగటి యింజనీర్ పాంగ్ గుంపులోనుంచి దారి చేసుకుంటూ జనం మధ్యకు వెళ్ళి అక్కడవున్న ప్రత్తిబేలుమీద నిలబడి వుపన్యాసం ఆరంభించేడు. జపాన్ మిల్లుయజమానుల, ఓవర్ సీర్ల అక్రమపశుప్రవర్తనను గూర్చి, అమానుషపద్ధతులపై కూలీలచేత బండచాకిరీ చేయించడాన్ని గూర్చి, పన్నెండుగంటలు చెమటోడ్చి పనిచేసినా కడుపునింపుకోలేని కూలీల దురవస్థల్ని గూర్చి,అతడుపన్యసిస్తూంటే జనం ఘోషిల్లిపోయేరు. కూలీల కోరికల్ని గురించి ఆలోచించి స్టేటుమెంటు తయారుచేయాలనీ మన హక్కులు గుర్తించబడేవరకూ ఒక్క కూలీకూడా వెనుకంజ వేయకుండా పోరాడాలనీ హెచ్చరించేడు, పాంగ్.

మీటింగు మాంచి వేడిమీద వున్నసమయంలో నూటయాభై మంది జపాన్ నావికులు సాయుధులై ఫ్యాక్టరీ ఆవరణలోకి దూసుకు వచ్చేసేరు. మిల్లు యజమానులు వాళ్ళని పిలిపించేరు. వాళ్లా రాగానే గేటు తలుపులు మూసేసేరు. అన్నిప్రక్కలా కాపలాదార్లను నిలబెట్టేరు. వాళ్ళ ఆఫీసరు దర్పంగా ముందుకువచ్చి కూలీలందర్నీ అక్కడినుంచి వెళ్ళిపొమ్మనీ, యెవరిపనుల్లో వాళ్ళు వుండాలనీ ఆజ్ఞాపించేడు.

"ఒక్కడూ కదలలేదు. ఇంజనీర్ పాంగ్ మీదే వున్నాయి అందరి కళ్లూ. అతడు మా వైపుతిరిగి "కామ్రేడ్స్! మీమీస్థలాలకు వెళ్లండి. ఎవరూ పనులు మాత్రం ప్రారంభించవద్దు. మీరు యెన్నుకొన్న ప్రతినిధులు చెప్పేవరకూ పని ముట్టవద్దు." అన్నాడు. గుంపంతాచెదరి యెవరి స్థానానికివాళ్లు వెళ్ళిపోతూన్నారు. నేనూ యింజన్ రూంకి వెళ్ళిపోయేను.

"మరి కొంచెంసేపట్లోనే మిల్లులోంచి కూలీలందర్నీ వెళ్లగొట్టమనీ, ప్రతివాడి నంబరుబిళ్లనీ లాక్కోమనీ ఆఫీసరు నావికులకు ఆజ్ఞయిచ్చేడు.

పోలుతర్వాత పోలు ఖాళీ చేయిస్తూన్నారు. ఏదో అపాయం జరుగుతుం దని గ్రహించి ఆడకూలీలు పారిపోవాలని యత్నించేరు. కాని అన్ని ద్వారాలు మూసివున్నాయి. ప్రతిచోటా సాయుధులు కాపలావున్నారు.

"నావికులు ఓవర్‌సీర్లను వెంటబెట్టుకొని కార్మికుల్ని గుంపులుగా వసారాల్లోకి లాక్కొచ్చి రబ్బరు ఊడలతో చావమోదుతూ అవరణలోకీ, అక్కడినుంచి గేటుబైటకూ యీడ్చేస్తూన్నారు. కొద్దిసేపట్లో ఆవరణలో చాలమంది కూలీలు ప్రోగుపడ్డారు. గేటుదగ్గర కాపలావున్న నావికులు వెంటనే తుపాకులు బారుతీసి మొదటిరౌండు గాలిలోకీ, రెండోది జనం మీదికీ కాల్చేరు. నిలుమన్నపళంగా ముగ్గురు కూలీలు చచ్చిపోయేరు. ఆరుగురు గాయపడ్డారు.

"కూలీల్లో భీతావహం పుట్టింది. ఫ్యాక్టరీలోంచి ఆడకూలీలూ,పిల్లలూ గుంపులుగా త్రోసుకుంటూ పరుగెత్తుకు వచ్చేసేరు. గేటు తెరుచుకుని, యేలాగైనా బైటపడి ప్రాణాలు దక్కించుకుందామని అందరికీ ఆతురత. నావికులు గుంపులమీదకురికి, సన్నీలతో పొడిచీ, తుపాకి మడమలతో మోదీ, లాఠీలతో చావబాదీ వీరవిహారం చేయనారంభించేరు. జపాన్ ఓవర్‌సీర్లు గేట్లు మూసేయాలని ప్రయత్నించేరు. కాని మేమెల్లాగో వాళ్ళను త్రోసేసి, గేట్లు బారుగా తెరిచేసేము. జనసమూహం రోడ్డుమీదకి విరుచుకు పడింది. జపాన్‌నావికులు వీళ్ళమీదకి మళ్లీ మళ్లీ తుపాకులు కాల్చేరు. ఇంకో కొందరు గాయాలతో పడిపోయేరు.

"మా మొదటి సమ్మె యీ రీతిగా ప్రారంభమైంది. రక్తపుటొరవడితో కార్మికులు అక్షరాభ్యాసంచేసేరు"

ఇంతవరకూచెప్పి పైన్ హో సిఞ తన కధను నిలిపేడు. రేవు నావ ఆవలిదరినుండి వస్తూంది.

"మనం పట్టణంలోకి పోడానికి రేవునావ వచ్చింది. కాని యింకో పావుగంట ఆలస్యంవుంటుంది. రాత్రివంతు ఓవర్‌సీర్లను యీ పడవ

తీసుకొచ్చింది. పగటివంతు వాళ్లు దీనిమీదే పెడతారు. వాళ్లు వచ్చేవరకూ నాప ఆగుతుంది."

"అదీ మంచిదే. ఈలోగా మనకథా పూర్తవుతుంది." అన్నాను.

"సమ్మెనుగురించేనా ? ఇంకేంతో లేదు. ఐపోవచ్చింది. సమ్మె చాల రోజులు జరిగింది. అంతకాలం సమ్మె జరగడం, కార్మికులంత పట్టుదలతో పోట్లాడడం అదే మొదలు. కాని చివరికి ఆకలిమంటలే మిల్లు మిల్లు యజమానులదగ్గరికి తరుముతాయి. కూలీలందరికీ సమ్మె ముగింపు చెయ్యాలనేవుంది. మిల్లు యజమానులు మాకోరికలు వేటికీ అంగీకరించనేలేదు. కళ్లుపోయిన ఆపిల్లవానికి నూరురూపాయిలు పరిహారం యివ్వడానికి [illegible] మావాళ్ళందరికి ఒక్క ఉపాయం తట్టింది. పట్టణంలో మాకులపెద్ద శెట్టి వున్నాడని చెప్పనే ఆయనదీ సాయం కోరుదామని నిశ్చయించుకున్నాము.

"మాప్రాంతీయులూ, మాబంధువులూ చాలమంది మిల్లులో పనిచేస్తున్నారని చెప్పెనుకదూ ? శెట్టి మాకులపెద్ద. అంతేగాక పయోధికుడూ, ఎంతో పలుకుబడిగలవాడూ కూడాను. చాల ధనవంతుడు. అందుచేతనే మావాళ్ళందరూ యితడంటే ఎంతో గౌరవిస్తారు. పట్టంలోకల్లా యితడే పెద్దవ్యాపారి కూడాను. 'జాతీయావమానం దినం' నాడు జపాన్ వస్తుబహిష్కారం తీవ్రంగా కొనసాగించబడినప్పుడు యీతడు జాతీయోద్యమానికి ఎంతో ధనసహాయం చేయడమేగాకుండా స్వయంగా సలహాలిస్తూ వుద్యమంలో పాల్గొన్నాడు. అల్లాంటి జాతీయాభిమాని కూలీలకేమైనా సాయం చేయకపోడని అందరికీ తోచింది.

"మాతరఫున ఐదుగురిని ప్రతినిధులుగా ఎన్నుకున్నాము. అందులో నేనొకణ్ణి. నాకప్పటికి పంధొమ్మిదేళ్లే. సమ్మెలో నాప్రవర్తన చూసేక కార్మికులకు నాయందుండే అభిప్రాయం మారిపోయిందనుకుంటా। మేము ఐదుగురం శెట్టి వద్దకు రాయబారం వెళ్లేం.

"మొదటినుంచీ యీ రాయబారానికి యింజనీర్ పాంగ్ విముఖుడు గానే వున్నాడు. దీనివల్ల ప్రయోజన మేమీ వుండదని అతని వాదం. పాంగ్ మా కులంవాడు కాడు; మా ప్రాంతీయుడూ కాడు. ఏదో మారు దేశీయుడు. అతనికి మా కులపెద్ద వైన్ ని గురించి యేమీ తెలియదు. అందుచేత మేము వెళ్ళడానికే నిశ్చయించుకున్నాము. వైన్ మమ్మల్ని తన భవనంముందరి ఉద్యానంలో కలుసుకున్నాడు. మల్బరీ వృక్షచ్ఛాయలో కూర్చుని హుక్కా పీలుస్తూ, కేశిసరోవరశోభను చూచి ఆనందిస్తూ ఆతడు కూర్చున్నసమయంలోనే మేము వెళ్లేము. మహోత్కృష్ట కన్ఫ్యూషియస్ మల్బరీ చెట్టుక్రిందనే జన్మించేడు, తెలుసా? మాలో పెద్దవాడు మా కష్ట నిష్ఠురాలను చెప్తూంటే సావధానంగా, బహుశ్రద్ధగా వింటూ కూర్చు న్నాడు వైన్. మా కష్టాలంటే అతని స్వజాతీయుల, దగ్గరిబంధువుల కష్టాలేగదా.......

"మాలో పెద్ద చెప్తూన్నాడు: 'మా సంపాదనంతా పోగుచేస్తే రోజుకు రెండుచేర్ల కూడా రాదు. మేమందరం మన ప్రాంతానికి పోవాలనే కోరుతూన్నాం. ఈ మేము పద్దాయ రేపుగదా? అక్కడివాళ్ళే తిండిలేక, పనులేక అల్లాడిపోతూన్నారు. జపాన్ పెట్టుబడిదార్లతో మేము చేస్తూన్న పోరాటంలో నువ్వు మాకేమైనా సాయం చేయాలి. కుల పెద్దవనీ, మన వాళ్ళందరిలోకీ అనుభవంగలవాడవనీ మేము నీ దగ్గరకు వచ్చి, సాయాన్ని కోరేము. నీవూ పెద్ద వర్తకుడవు. జపాన్‌వాళ్లు మన దేశాన్ని, ప్రజల్ని, మన ధనసంపదల్ని ఎల్లా దోచుకుపోతున్నారో నీకు తెలుసును. నీకు మనవాళ్ళమీద అభిమానం లేదా? మన ప్రజల బాధల మీద సానుభూతీ, జపానువాళ్ళ దౌర్జన్యాలమీద క్రోధమూ నీకూ వుంటాయి. నీకు తెలియనిదేముంది?' అని చెప్పి మా రాయబారం ముగించేము.

"వైన్ వెంటనే యేమీ సమాధానం యివ్వలేదు చాలసేపు నిదానంగా

ఆలోచించేడు. అదిచూస్తే మా అందరికీ ఆశ కలిగింది. వైస్ మాకేదో దారిచూపి తీరుతాడనే అనుకున్నాము.

"కొంతసేపైన తర్వాత వైస్ మాట్లాడ నారంభించేడు. 'యోగి వర్యుడు చ్వాంగ్ ట్జీ కథ విన్నారుకదూ? ఆయన ఒకరోజు నిద్రపోతూ తాను సీతాకోక చిలుకైనట్లు కలగన్నారు. తాను పుష్పాలమీద ఎగురుతూన్నట్లూ, తాను చ్వాంగ్ ట్జీ కానట్లూ భావం కలిగింది. మెలకువ వచ్చిన తర్వాత ఆయనకు పెద్ద సందేహం కలిగింది. చ్వాంగ్ ట్జీకే నిద్రలో తాను సీతాకోక చిలుక ఐనట్లుగా కల వచ్చిందా? లేక సీతాకోకచిలుకే నిద్రలో చ్వాంగ్ ట్జీ అయినట్లు కలగంటూన్నదా? అదీగాకపోతే చ్వాంగ్ ట్జీయే సీతాకోకచిలుకా? లేకపోతే యీ రెండు నామరూపాలూ, ఒకేఒక పదార్థముయొక్క అవస్థాభేదములా?'

"నిజం చెప్పాలంటే నేనూ యిప్పుడు చ్వాంగ్‌ట్జీ అవస్థలోనే వున్నాను. చైనీయుణ్ణీ, వర్తకుణ్ణీ అవడంవల్ల నేను మీకు న్యాయం చేయవలసిందే నని ఒప్పుకోవాలి. ఈ దృష్ట్యా మన ప్రయోజనాలు విరుద్ధాలుగావు. కాని,- అదృష్టవశాత్తూ నేను భూస్వామిని, పెట్టుబడిదారుణ్ణీ, కమీషన్ వ్యాపారినీ కూడాను: అందువల్ల నేను మిమ్మల్ని ముఖ్యంగా మూడు ప్రశ్నలడుగుతాను. వాటికి మీజవాబులు విన్నతర్వాత నేనొక నిర్ణయానికి రాగలుగుతాను.

"ఒకటి: ప్రత్తిధరలింకా పడిపోయి, ప్రజల్లో ఆందోళనయింకా హెచ్చుపెరిగితే నాభూముల్లో ప్రత్తి సాగుచేసే రైతులనుంచి శిస్తు వసూలు చేయనా? వద్దా?"

"రెండు: నాపడవలమీదా, సమీకు కొట్లలోనూ పనిచేసే కూలీల విషయం ఏమిటి? వాళ్లు తమప్రస్తుతావస్థతో తృప్తిపడి వూరుకుంటారా?

"మూడు: నేను మీతో వుంటే జపాన్‌వాళ్ళు నాదగ్గర ప్రత్తికొంటారా? నాకావిధంగా కలిగే నష్టానికి బాధ్యులెవరు?

"అదీగార కూలీల్లో యీగందరగోళం. అశాంతి పెచ్చుపెరిగితే జపాన్‌వాళ్ళు మాత్రమే నష్టపడతారనీ, మేము-చీనా భూస్వాములం. వర్తకులం నష్టపడమనీ హామీ యేమిటి? మాకు దెబ్బతగిలితే మావల్ల బ్రతుకుతూన్న రైతులూ కూలీలూ కూడా నష్టపడాల్సి వుంటుందిగదా? అందుచేత మహాత్ముడు కన్ఫ్యూషియస్ సెలవిచ్చినట్లు 'తండ్రి తండ్రిగా వుండాలంటే కొడుకు కొడుకుగానే వుండిపోవాలి.' ఈ ప్రవచనాన్ని మనం మరచిపోకుండా వుండడం వివేకం. ఇంతే నేను చెప్పదలసింది.'"

"ఈ మాటలు విని, తాను సీతాకోకచిలుకో-చ్వాంగ్ ట్జియో నిశ్చయించుకోజాలని అవస్థలో పడివున్న చైన్ని దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయేము.

"కాస్తో కూస్తో పోరాటబుద్ధి ఐన చైన్నకే విడిపోనియీ ధర్మసందేహం పొట్టచింపినా లక్షించుకున్నాలేని మాకుమాత్రం ఏం విడిపోతుంది?

"తరువాత కొద్దిరోజులకే మేము మాపనుల్లోకి వెళ్ళవలసి వచ్చింది. సమ్మె ఓడిపోయింది. కాని యేదెట్లాఅయినా ఆ సమ్మెతర్వాత మేము మునుపటి కూలీలం మాత్రంగాము. ఇంజనీర్ పాంగ్ మాకు కొత్త పాటలు నేర్పుతున్నాడు. పిచ్చుగాళ్ళూ, కళాసులూ పాడుకొనే పాతపాటలకు బదులుగా వాళ్లా యీ కొత్తపాటలే పాడుతున్నారు."

చైన్ హోసిన్ కథ పూర్తిచేసేడు. కథ ముగిస్తూనే చైనాభాషలో అంతర్జాతీయ గీతాన్ని అందుకున్నాడు, సిన్.

ఆకలిమంటచె మలమలమాడె అనాథులందరు....
...............ఒకటేనోయ్! ఒకటేనోయ్!

చీపులమీద వేళ్ళక్రింద క్రుంగి నడుస్తూ రేవుకూలీలు వరుసలుగా విధీ విరామం లేకండా మిల్లులోకి పోతూనేవున్నారు. వాళ్ళ మూలుగులు అంతర్జాతీయ గీతానికి శృతిగా వున్నాయి.

ఓహోహో! ఏహేహే?
ఆహోరీ! ఈహీహీ!

# పిత్రాజ్ఞాపమూర్తి

ఆవేళమధ్యాహ్నం కొంచెం పొద్దువాలే వేళకి మాప్రోపగాండా ట్రెయిన్ సెన్ యీ స్టేషన్‌లో నిలబడింది. నాకళ్ల కక్కడా మామూలు దృశ్యమే కనబడింది. స్టేషనంతా అసహ్యంగానూ, శిధిలావస్థలోనూ వుంది. చింకిగుడ్డలు కట్టుకున్న సిపాయీల గుంపులు, మొలకి కౌపీనమూ, నెత్తిని టోపీలూ ధరించిన రైతులూ ప్రతిచోటా యెదురవుతూన్నారు. దేశమంతా నానాభీభత్సంగానూ వున్నా సహజసౌందర్యం మాత్రం మాయలేదు. దారిప్రక్క కుష్ఠురోగిలా రైల్వే స్టేషన్ దిగులుగా కూర్చుని గొణుగుతూంది.

హాంకోలోని యంగ్ పయొనీర్స్ బ్యూరోవారు చిన్నపిల్లల్లో ప్రచారం చేయడానికై మాతోకూడా 'లీ' ని పంపించేరు. అతన్ని మేము 'కప్ప పిల్ల' అని పరిహాసంగా పిలిచేవాళ్లం.

"ఈ రాత్రంతా మన ట్రెయిన్ యిక్కడ ఆగుతుంది. నేను ఊళ్ళోకి వెళ్ళి తెల్లారేటప్పటికి వచ్చేస్తాను." అన్నాడు లీ నాతో.

"ఆలస్యం చేసేవుగనక. రేపు ఉదయం స్టేషన్‌లో మీటింగువుంది. పిల్లలకోసం నువ్వు ఆ మీటింగులో మాట్లాడాలి." అని హెచ్చరించేను.

"కంగారు పడకండి. తెల్లవారేసరికి వచ్చేస్తా" నన్నాడు లీ.

అంతక్రితం రాత్రే మాట్రెయిన్ షియాన్‌యాన్ స్టేషనులో ఆగినప్పుడు, లీ నన్ను రైల్వేమన్స్ క్లబ్బుకు తీసుకుపోయేడు. అది స్టేషన్ వెనకాలే ఒకచిన్న యింట్లో పెట్టేరు. ముందు చిన్న ప్రాంగణము, వెనక ఒకటే పొడుగాటి హాలు, క్లబ్బంతా యింతే. హాలులో వరుసగా బెంచీలువేసి వున్నాయి. 1923 ఫిబ్రవరిలో జరిగిన పూ పీ పూ రైల్వే సమ్మె సందర్భంలో కాల్పులవల్ల చనిపోయిన కార్మికుల ఫొటోలు గోడలమీద తగిలించేరు. ఆ కార్మికవీరుల ముఖాలన్నీ మోటుగానూ, అమాయికంగానూ వున్నాయి. అందులో కొందరిని బ్రతికివుండగా తీసి

నవి. మరికొన్ని వాళ్ళు కాల్పుల్లో చనిపోయేక తీయించినవీని. కాల్చి వేయ బడ్డప్పుడు ముఖాలనిండా గాయాలు తగిలి రక్తం ప్రవాహాలుకట్టి. జీవకళ తొలగి మొఖాలు గాజుపారి పోయినప్పుడు తీయించిన ఆఫొటోలు ఎవరికైనా రక్తం ఉడుకెత్తిస్తుంది.

ఆ ఫొటోల్లోనే లీ. తన తండ్రి ఫొటో కూడా వుందని చూపేడు. అతడు చనిపోయినప్పుడు ముప్పైఏళ్ళవాడు. మాంగ్రీ (ముడిషా) మను కుని పెద్దదైన అందమైన పెట్టుకున్నప్పటి ఒకసముఖంలో మహాయో గుల లక్షణాలున్నాయి. సమ్మెలో పాల్గొన్న కార్మికనాయకుల్ని తీసుకు పోవడానికి సిద్ధంగావున్న యింజన్నుని నడుపుకుని పారిపోవడానికి ప్రయత్నించేడని అతణ్ణి కాల్చేసేరుట. వూ పే ఫూ సేనాపతుల్లో ఒకడే అతన్ని కాల్చేసింది. అతడా వెంటనే యింజన్ డ్రైవరు కుటీరానికివెళ్ళి లీతో వదరేడట:

"నీబాబు బందిపోటుదొంగ. వాడిలాగే నువ్వూ తిరిగేవంటే నీగతీ అంతే బొతుంది. తెలిసిందా? ఆ తర్వాత నీపెద్దలకి నీళ్ళుచుక్క వది లేందుకైనా ఎవడూ వుండడు."

అప్పటికి లీ వయస్సు పదకొండేళ్ళే. కాని సముయోచితంగా మాట్లాడే తెలివితేటలు అప్పటికే అతనిలో వున్నాయి.

"అయ్యో! నాధర్మాన్ని నెరవేర్చ ప్రయత్నిస్తాను. తండ్రి ఋణాన్ని తీర్చుకుంటే కొడుకు పుట్టిన ప్రయోజనమేమిటి?"

అప్పటి కాల్పుల్లో యాభైమంది కార్మికులు చనిపోయేరుట. వాళ్ళ బిడ్డలందరికీ చదువు చెప్పించే బాధ్యత కార్మికసంఘమే వహించింది. రైల్వేమన్స్క్లబ్ దగ్గరే ఒకబడి యేర్పాటుచేసేరు. లీ అన్నగారు ఆపాఠ శాల్లోనే చదువు పూర్తిచేసి, రైల్వే నౌకరీలో చేరేడట. లీ యెంతో ఆత్మవిశ్వాసంతో చెప్పేడు.

"మేమందరం కమ్యూనిష్టులమైపోయేం. క్యు మిన్ టాంగ్ పార్టీ

ధనికులకీ, భూస్వాములకీ, ఉద్యోగులకీ తగినది: మాబోటి కష్టజీవులకీ, పేదలకీ కమ్యూనిస్టుపార్టీలోనే స్థానం."

అని చెపుతూ చొక్కా లోజేబులోనుంచి 'యంగ్ కమ్యూనిస్టు' బాడ్జి తీసి చూపించేడు.

ఆరోజంతా దళం మర్నాటి మీటింగ్ యేర్పాటుల్లో మునిగివుంది. ట్రెయిన్‌లోని ప్రెస్సులోనే మీటింగునోటీసు అచ్చువేసేరు; చుట్టుప్రక్కల గ్రామాలన్నింటిలోనూ ప్రచారం చేసేరు; ఉపన్యాసకులను సిద్ధపరిచేరు.

సాయంత్రం ప్రారంభించే యిద్దరు రైల్వేకార్మికులు ఉత్తరాన్నుంచి వచ్చేరు. మా ఘాంగ్ జిల్లాలో విప్లవం సాగించనీ, నల్లమందు యిజారా పాడే ఆఫీసును రైతులు నాశనం చేసేరనీ, రైలుమార్గాన్నికూడా తెగగొట్టడానికి ప్రయత్నిస్తూరనీ వాళ్లు చెప్పేరు.

రాత్రి చాలా వుక్కగా వుంది. తుపాను రాబోయే సూచనలున్నాయి. నేనూ, మరికొందరు ప్రచారదళ సభ్యులు స్విచ్ దగ్గర నిలుచుని మాట్లాడుకుంటూన్నాము. సైనికులతో నిండిన ట్రెయినొకటి మమ్మల్ని దాటి వెళ్ళింది. రైలు పెట్టెల రేకుగోడలుకూడా కాలి వేడెక్కి వున్నాయేమో బండిలో పడుకోలేకపోయేము. ఒక్కరికీ రాత్రంతా నిద్రే పట్టలేదు. మనస్సులో యేవేవో ఆలోచనలు ముప్పిరిగొన్నాయి.

ప్రజల్లో అశాంతి వ్యాపిస్తూన్నమాట నిజమే. ఐతే! టెలిగ్రాఫ్ మిషన్ తెల్లవాళ్లా టికు టిక్-టిక్ టిక్ మంటూనేవుంది. గుమాస్తా రైలు మీద వస్తూన్న కల్లోలవార్తలను రికార్డుచేసుకుంటూ, తిరిగి హాంకాంకు పంపుతూనే వున్నాడు. అస్థినగ్నశరీరులూ, జీర్ణవస్త్రధారులూ ఐ స్టేషనులో తిరుగాడుతూన్న సిపాయిలు మూటాముల్లె పుచ్చుకుని రైలుపట్టె వెంబడే దక్షిణదిశగా బైలుదేరి పోతున్నారు. సగంరాత్రికే స్టేషన్ జనశూన్యమై పోయింది. పహారా సిపాయి బూట్లచప్పుడు టకా-టకా గడియారపుధ్వనిలా వినిపిస్తూనేవుంది. నీరవమైన నిశీథిని యీధ్వని రానున్న దుర్గతిని గూర్చి హెచ్చరిస్తూన్నాయా ? అన్నట్లుంది.

నిద్రరాక, లేచి కాస్తదూరం తిరిగితే గాలైనా తగులుతుందని రైలు కట్ట వెంబడే బైలుదేరాను. మేఘాల్లేని వినీలాకాశంలో నారింజపండ్లలా మెరుస్తూన్న నక్షత్రాల్ని చూస్తూ, నా నిరుత్సాహాన్నీ చిరాకునూ మరిచిపో ప్రయత్నిస్తూన్నా. ఇంతలో చైనీయులు సృష్టి ప్రారంభాన్ని గూర్చి చెప్పే గాధ జ్ఞాపకం వచ్చింది.

"భూమికీ ఆకాశానికీ పెళ్ళయిందిట. కొంతకాలానికి భూమికి ఒక కొడుకు పుట్టేడు. అతడే మొదటి మానవుడు. అతని పేరు పాన్‌గూ: ఆకాశపుత్రుడు. అతడు చిరకాలం జీవించేడు. చనిపోయినప్పు డాతని ఊపిరి వాయువయింది: స్వరం పురుములయినాయి; ఎడమకన్ను సూర్యుడుగా, కుడికన్ను చంద్రుడుగా, మొండెం నాలుగు భూఖండాలుగా, రక్తం నదులుగా; శరీరం రాత్రిగానూ, తలవెంట్రుకలు నక్షత్రాలుగానూ: పళ్ళూ, ఎముకలూ లోహాలుగాను, మెదడు నవరత్నాలుగాను అయి నాయి. అతని శరీరం మీది చీడపురుగులే మానవులుగా ఆయ్యేరు."

ఈ ఆలోచన వచ్చేసరికి అసహ్యం వేసి, ఉమ్మేసేను. చీనాలో బీద రైతులు లక్షోపలక్షలు. వాళ్ళు చీడపేలతో సాహచర్యంలోనే జీవితాన్ని గడుపుతారు. దరిద్రానికీ చీడపురుగులు తోడబుట్టువులు. అంచేతనే వీళ్ల చీడపురుగుల్లోంచి పుట్టేరంటే అంతా విశ్వసించి వుంటారు.

కోట్లకొలదీ పుట్టుతూ గిట్టుతూన్న యీక్షుద్రమానవులు ఏమిచేయ గలరు? కర్మగతికి తలఒగ్గి, పునర్జన్మ యెదురుచూడడమే వాళ్ళకి బోధిం చేరు. శతాబ్దాలుగా పీడిస్తూన్న దారిద్ర్యమూ, దాస్యము, దిక్కుమాలిన తనమూ వాళ్ళనెత్తిన కొండల్లావుండి అణిచి పెడుతూన్నాయి. వాళ్ళకు యీమధ్యనే ధృవతారలా ఎర్రజెండా విముక్తిమార్గాన్ని చూపించినపుడు విమూఢులైపోయేరు. హూపే, హోనాన్ రాష్ట్రాల "కుత్తరంగా 'ఎర్ర సైన్యం' ప్రజల్ని విముక్తి చేస్తూందని వదంతులు వ్యాపించినాయి. వాళ్ల తమరినికూడ యీపీడననుంచి తప్పించుతారని అమాయిక రైతులు విశాలమైనా" యంతటా ఆశలు పెట్టుకుని కూర్చున్నారు.

చీనా చరిత్రలో అసంఖ్యాకమైన సైన్యాలు వచ్చి పోతూ వచ్చేయి. కాని యీ యెఱ్ఱసైన్యం వాటిల్లాంటిదిగాదని యీ అమాయకులుకూడా అర్థం చేసుకున్నారు. దేశాన్ని నాశనం చేస్తూన్న యీ యుద్ధాల్లో యెందరో జనరల్సు ససైన్యంగా పాల్గొంటున్నారు. క్యుమిన్‌టాంగ్ సైన్యాలకూ, ముక్డేన్ సైన్యాలకూ, యింకా చెప్పన్నసైన్యాలకూ కూడా యీ యెఱ్ఱసైన్యమంటే సింహస్వప్నం!

ఎఱ్ఱసైన్యాన్ని వాళ్లు చూడలేదుగానీ మిగిలిన సైన్యాలన్నిటినీ అక్కడి ప్రజలు చూసేరు. వాళ్లందరూ తమకు శత్రువులే యని గ్రహించేరు కూడాను. వీళ్లనుంచి తమగ్రామాల్ని కాపాడుకోడానికి పాతకత్తులూ, జానికితాడు తుపాకులూ పట్టుకుని తయారవాలను కుంటున్నారు. టైపింగ్ విప్లవకాలాన్నుంచీ ప్రజలకిది అనుభవమే. సారవంతమై, ధనధాన్యసమృద్ధమై, మధ్యదేశ మణియని పేరుగాంచిన తమరాష్ట్రాన్ని గత పదిహేను సంవత్సరాల్లోనూ యెడారిగాచేసిన యీ జనరల్సునుంచీ, సైన్యాలనుంచీ రక్షించుకోవాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. కాని తగిన విజ్ఞానంలేకా, ఐకమత్యం లేకా ప్రజలు తమ గ్రామాల్నీ, ఆస్తిపాస్తుల్నీ, మానప్రాణాల్నీ కాపాడుకోలేకనే పోతున్నారు. మొదట ఒక జనరలూ, తర్వాత యింకోడూ ప్రజల్ని వుపయోగించుకుని, తమ అవసరం తీరేక చెరకు పిప్పిలా విసర్జిస్తూనే వున్నారు. ప్రస్తుతం వూ పీ ఫూ యొక్క ఆఫీసర్లు యిక్కడ వున్నారు. క్యుమిన్‌టాంగ్ సైన్యాలకు వ్యతిరేకంగా వీళ్లంతా పోరాడుతూన్నారు. రేపు క్యుమిన్‌టాంగ్ వచ్చి వీళ్లని వూ పీ ఫూ మీద ధ్వజమెత్త మనవచ్చు.

పాపం! ప్రజలకి ఒక్కఆశ మాత్రం యింకా వదలలేదు. క్వేన్ లంగ్ పర్వతాల్లోంచి అద్భుతశక్తివంతుడొకడు ఉద్భవించి తమ్మొద్ధరిస్తాడని వాళ్ళ నమ్మకం! ఆ ఆశతోనే చేతులు ముడుచుకు కూర్చుని, యేసైన్యం వస్తే ఆసైన్యానికే వంగి సలాములు కొడుతూ, తమ సర్వం అర్పిస్తూ, కిమ్మనకుండా వున్నారు. దీనికి ప్రతిఫలంగా ప్రతి జనరలూ,

తాను వెళ్ళిపోయేటప్పుడు యిళ్లూ పంటలూ తగులబెట్టి. వేలాది ప్రజల్ని కాల్చేసి మరీ వెడుతూన్నాడు. నిస్సహాయులైన యీ అమాయికు లేంచేయ గలరు? వీళ్ళ ఆశల్ని క్వెన్‌లంగ్ పర్వతం మీదినుంచి షియాన్‌యాన్ రైల్వేట్రక్‌వైపు ఎవరూ మళ్ళించలేరా?

ఈ ఆలోచనలలో మునిగి నాబుర్ర కాలెక్కిపోయింది. ఆకు అల్లాడ డంలేదు. ఒక్కొక్కటి ఒళ్లు ఉడికిపోతూంది. నీరసమైన నిశీధిని అంతులేని ఆకాశం మరింతగాఢంగా చేస్తూంది.............రైలు దగ్గరికి తిరిగివచ్చి. దీపం వెలిగించేను. నాపెట్టెలోంచి ఒక ప్రాచీనగ్రంథాన్ని తీసి పుటలు తిరుగవేస్తూ కూర్చున్నా. పుస్తకంలోని పుటలు పసిమిరంగులోకి మారి పోతున్నాయి. శిధిలమైపోతూన్నా. పూర్వప్రపంచం తన బోధనలద్వారా యింకా ప్రజల్లోని తిరుగుబాటుతనాన్నీ, బాధల్ని సహించకపోవడాన్నీ నెమ్మదిపరుస్తూ, జోకొడుతూ నేవుంది.

"క్షమింపరాని మహాపాపములు మూడు: వాటిలో పితృఋణమును తీర్చకపోవుటే గొప్పది." అని చదువుతూండగానే నిద్రలో మునిగేను.

తెల్లవారుతూంది. చుట్టుప్రక్కలనుంచి అప్పటికే వేలకొలదిగా రైతులు ప్రాపగాండా ట్రెయిన్ దగ్గరకు చేరుకున్నారు. ప్రాతఃకాలాన్నే మీటింగు పూర్తిచేయాలని మాఉద్దేశ్యం. ఏమాత్రం పొద్దెక్కినా యెండ వేడిమి భరింపశక్యంగాదు. ఉపన్యాసాలు సాగుతూంటే నేను మీటింగులో అటునిటు తిరుగుతూ ప్రజలు యేరీతిగా భావిస్తూన్నారో గమనిస్తూన్నాను. రైతుల ముఖాల్లో అవిశ్వాసము. విసుగుదల. వట్టివేసుర తప్ప మరేవీ కన్పించడంలేదు ప్రచారకులకూ. రైతులకూ మధ్య దుర్భేద్యమైన రాతి గోడ ఒకటి నిలబడి వుందని గ్రహించేను. ఈ ఉపన్యాసకులంతా పట్ట ణాలనుంచి వచ్చినవాళ్లే. అక్కడే భూస్వాములు, ధనికులు, జనరల్సు. విదేశీసెట్టుబడిదార్లూ వుంటారు. ఇంక వీళ్లందరూ పల్లెటూరి రైతులు; దాస్యం, దారిద్ర్యం, అజ్ఞానం, యివే వీరికి నిత్యం తోడునీడలు. పట్టణ వాసులైన ప్రచారకులకూ కష్టజీవులైన పల్లెటిరైతులకూ మధ్యనున్న అగాధం ఉపన్యాసాలవల్ల పూడేటట్లులేదు.

నేను యీ ఆలోచనాసముద్రంలోబడి యిట్టటు కొట్టుకుంటూనే, దూరంలో పర్వతము మీదినుంచి దిగివస్తూన్న ఒక గుంపును చూసేను. అందులో నలుగురు భుజాలమీద స్ట్రెచర్ నొకదాన్ని మోస్తూన్నారు. దాని మీద నీలిగుడ్డ కప్పివుండడం కూడా కనిపించింది. వాళ్లు మెల్లిగా నడిచి వచ్చి, మామీటింగును సమీపించేరు. ఉపన్యాసవేదిక దగ్గరే తమ బరువును దింపుకొని, యిద్దరు దాన్ని తమచేతులమీద యెత్తి అందరికీ కనిపించేలా పట్టుకున్నారు. మరి ఐదుగురు నిశ్శబ్దంగా తమ తుపాకులమీద గడ్డాలు ఆన్చి నిల్చునివున్నారు. అందరిలోకీ తలనెరసిన వృద్ధుడు పాడె మీదున్న నీలిగుడ్డను తొలగించేసరికి, దానిమీద ఒకబాలుని మృతశరీరం కనిపించింది. అతడు లీ అని మేము వెంటనే గుర్తించి, నిర్ఘాంత పోయేము. తలకు కట్టిన గుడ్డ రక్తంతో తడిసివుంది. ముఖం పాలి పోయి, కళ్లు మూతపడి, పెదలు దగ్గరగా నొక్కుకొని పోయివున్నాయి. వృద్ధుడు వేదికమీది కెక్కి, జనంవైపు తిరిగి, ఆవేశంతో మాట్లాడ నారంభించినపు డంతా ఆసక్తితో, నిశ్శబ్దంగా విననారంభించేరు.

"సోదరులారా! మేము మా చంగ్ పరగణానుంచి వస్తూన్నాము. మీబోటి పేద రైతులమే, మేమూ. ఈ పిల్లవాడు లీ నిన్నరాత్రి మా గ్రామం వచ్చేడు. మేమందరం సమావేశం యేర్పాటు చేసుకున్నాం. అందులో పట్టణాల్లోని పీడకార్మికులను గూర్చి లీ మాట్లాడతానన్నాడు. సభాప్రారంభంలో "క్వెన్‌లంగ్ పర్వతంనుండి వచ్చే బోధకుడా!" అనే పాటను పాడుతూన్నాం. మా కందరికీ గురువు, బోధకుడూ ఐన హ్వాంగ్ ముందర కూర్చుని వున్నాడు. లీ ఆతణ్ణి చూస్తూనే,—

"ఈ పాపాత్ముడు మీ గురువా? వీడు క్వెన్‌లంగ్ పర్వతాలనుంచి గాదు బోధనలు తెచ్చేది! జనరల్ ప్రా పీ ఫూ సేనానివేశానుంచే బోధనలు తెచ్చి మా చెవులకెక్కిస్తూన్నాడు! వీడూ ఒక ఆఫీసరే. ఈ దుర్మార్గుడు నా తండ్రిని నాలుగు సంవత్సరాల క్రిందట చంపేసేడు. వీడి దగ్గరే తండ్రి ఋణం తీర్చుకుంటానని ప్రతిజ్ఞపట్టేను. వీని చేతులు నా తండ్రి యొక్క

గాక యింకా యెంతోమంది కష్టజీవుల రక్తంతో తడిసినాయి........"
అంటూ యింకా యేదో చెప్పబోతూన్నాడు.

హ్వాంగ్ అంతలోనే తుపాకియెత్తి, అక్కడే, ప్రార్థనా మందిరం లోనే లీ ని కాల్చేసేడు. నేను ఆలోచించేను : "ఈ పిల్లవాడు చెప్పింది నిజమే ఐతే వీడికి చావుకంటె తగిన శిక్షలేదు. వాడు చెప్పింది అబద్ధమే ఐతే మా గుటాజీని మృత్యువు సమీపించనేలేదు. ఎందుచేతంటే మా గురువు విష్ణుపరుడు, మత విధులన్నీ తు. చ తప్పడు. తుపాకీ గుండు గాని, కత్తిగాని, బల్లెంగాని అట్టి పవిత్రుని శరీరాన్ని ఛేదించలేవు. అంతా ఈశ్వరేచ్ఛ !" వెంటనే రివాల్వరుతీసి వాణ్ణి తలమీదా, గుండెల్లోనూ, కాల్చేను. హ్వాంగ్ కిక్కురుమనకండా కుక్కలా చచ్చేడు. వాడి అంగీ లోపల ఒక జాబు దొరికింది. అది జనరల్ ఫూ పీ ఫూ నుంచి వచ్చినది; దానిలో కష్టజీవుల యెడలయెంతో నిరసనా, ద్వేషం వెళ్ళగ్రక్కుతూ వ్రాయబడివుంది. ఎన్నో కుటిల విషయాలందులో వున్నాయి. అప్పుడు యీ పిల్లవాని శరీరాన్ని యిక్కడికి తీసుకుని వచ్చేము. మాకు యేమీ తెలియడంలేదు. మా కష్టాలనుంచి విముక్తి నొందడానికి మార్గం యెటుందో తెలుకోవాలని వచ్చేము. మేము ఏం చెయ్యాలి ? మాకు దారి ఎక్కడ దొరుకుతుంది ?" అని కూర్చున్నాడు.

ఒకవైపునుంచి యువకుడొకడు గబగబా పరుగెత్తుకుంటూ వచ్చేడు.

"షియాఁా యాన్ రైల్వేక్లబ్‌లో మీకు దారి దొరుకుతుంది !" అని అతడు కేకేసేడు.

అతని కండ్లవెంబడి నీరు కాల్వలుగడుతూంది; శరీరం వణికిపో తూంది; నిట్టూరుస్తూ, ఆయాసంతో మళ్లీ అరచేడు :

"షియాన్ యాన్ రైల్వేక్లబ్‌లో !"

అతడు శవాన్ని సమీపించి, లీ మీదపడి భోరుమన్నాడు.

అతడే లీ అన్న : రైల్వేపనివాడు.

# అతిరథులూ - మహారథులూ

లుంగ్‌హై రైల్వేమీద పోరాటాలు జరిగిన ఆరోజులు మరిపురావు. నలుగురి సేనలు అక్కడ పోగుపడినాయి. అందరూ ఒకరికొకరు శత్రువులే. మొనలుకూడుతూ మళ్లీ చెదరిపోతూన్నాయి. పోరాడుతూన్న సేనాధిపతులు తమతమ గూఢచారుల్నీ, రాయబారుల్నీ ఒకరొకరిదగ్గరకు యెడతెగక పంపుతూన్నారు. ఈ క్షణంలో మిత్రులుగా వున్నవాళ్లు మరుక్షణంలో శత్రువులుగా మారిపోతున్నారు. ఏపక్షంలో పోయి చేరడమో చాలమందికి యింకా తేలలేదు. ఎత్తుపై యెత్తులు నడుస్తున్నాయి. పటాలాలలో కుట్రలుజరగడంవల్ల 'ఫీల్డుమార్షల్సు' పదేసిరోజులకొకరు మారిపోతూన్నారు. హోనాన్‌రాష్ట్రం అంతా సర్వనాశనం ఐపోయింది. ఆకలితో అపురుమంటూ, కట్టుగుడ్డలు పీలికలై జీరాడుతూంటే, మురికి శరీరాలతో సైనికులంతా గుంపులు గుంపులుగా గ్రామాలంట తిరుగుతూన్నారు. వాళ్లు పైరుచేలని త్రొక్కివేస్తూ, రైతుల గాదుల్లో మిగిలివున్న కొద్దిగింజల్నికూడా వూడ్చేసి తీసుకుపోతున్నారు. రోడ్లప్రక్క మురికికాలవల్లోనూ, పల్లాల్లోనూ శవాలు కుళ్లుతూ సంస్కారం చేసేవాళ్లైనా లేక పడివున్నాయి. మాలకాకులు గుంపులు గుంపులుగా యెగురుతూ శవాల్ని పీక్కుతింటున్నాయి. రైతులు కూడా దుడికినీ తరిమివేసి, పెళ్ళాం పిల్లలతో పర్వతాల్లోకి పారిపోయేరు. పర్వతాల్లో దాక్కొని వుంటూనే అడపా దడపా రోడ్లమీదికి గుంపులుగావచ్చి కర్రలతోనూ, పాతకత్తులతోనూ పటాలాల్లోంచి విడివడి తిరుగుతూన్నసైనికుల్ని చంపిపారేస్తున్నారు. యుద్ధం అని చెప్పుకోదగిన పోరాటాలు జరక్కపోయినా, దోపిళ్లూ, పెద్దపెద్దలంచాలూ, మిత్రద్రోహాలూ,—యివి నిత్యకృత్యాలై పోయినాయి. సేనాధిపతులందరూ స్వార్థాపేక్షతో తమలో తాము ఒడంబడికలు చేసుకుంటూ వ్యాపారులుగా తయారయ్యేరు. జరుగబోయే యుద్ధాలుకూడా వాళ్ళ పర్కకషంతులమీదనే ఆధారపడివుంటున్నాయి.

నేనూ, పాండూ కలిసి హ్వాంగ్-హో నదీ తీరాన్నే వున్న రైలుస్టేషన్ చేరుకున్నాం. పడమటికి పోవాలని మా ఊహ. రైలు యెక్కాలని మేము చేసిన ప్రయత్నాలన్నీ విఫలం ఐపోయినేవున్నాయి. ముక్డెన్ సేనలు కొద్దిరోజుల్లో స్టేషన్‌ను ఆక్రమించుతాయని వదంతిగావుంది. ఆరోజు రాత్రంతా చాలా ఉక్కగా వుండి, తెల్లవార్లూ కన్ను మూతపడలేదు. తెల్లవారింది. ఇంక ఆరోజునేనా తప్పక ఆ పాడుప్రదేశాన్నుంచి వెళ్ళిపోయేందుకు కడపటి ప్రయత్నం చేయాలనుకుని, సేనాపతి సాయం స్వయంగా పోయి అడుగుదామని స్థిరపరచుకున్నాను.

సేనానివేశం రైలుస్టేషన్‌లోనే వుంది. సేనాపతి మకాం కూడా ఒక రైలుపెట్టెలోనే. ఆ పెట్టె దుమ్ముధూళీతో నిండి పాడుకంపు కొడుతూంది. సేనాపతి మాత్రం మమ్మల్నెంతో సౌజన్యంతో, ఆదరంగా, దర్జాగా గౌరవించేడు. సమయోచిత మర్యాదలూ, లాంఛనాలూ జరిగించి పాండూ ప్రాగ్దేశీయులకు సహజమైన చాకచక్యంతో మాట్లాడడం ఆరంభించేడు. ఏలాగైనా పరిస్థితుల్ని గురించిన భోగట్టా అతని నోటమ్మట లాగాలని పాండూ ప్రయత్నం.

రైలుపెట్టె కిటికీల అద్దాలతలుపులు వేసివున్నాయి. అద్దాలమీద యీగలుబ్రాలి తెగముసురుతూండడం వలన లోపల వెలుతురు మసకమసకగావుంది. సేనాపతి ముఖం వాడి, విన్నబోయివుంది. అతగాడికున్న అధికారంకూడా అంతంతమాత్రమే. పరిస్థితులు విషమంగా వున్నట్లు అతని ముఖలక్షణాలే చెప్తున్నాయి. జిడ్డోడుతూ చెమటలు కారుతూన్న సేనాపతి ముఖంవైపు నేను ఆతురతగా చూస్తూన్నా.

ఆదివరకే మాకు యీ సేనాపతి చరిత్రంతా తెలిసింది. అతని క్రింద వున్న సైన్యాలు తక్కువే. టీన్‌ట్సిన్ మొదలు హోనాన్‌దాకా మధ్యనున్న దేశంఅంతా, ఒక ఫీల్డు-మార్షలు దగ్గర్నుంచి మరొకడి దగ్గిరికి సపరివారంగా చెడతిరుగుతూన్నాము. కాని, యీతనికోరిక యింకా సఫ

లంకానేలేదు. పాపం! టూఫాన్ అనే బిరుదూ, నిరాఘాటమైన నియమిత రాబడీ, నల్లమందు గుత్తవ్యాపారం చేసుకొనే హక్కూ, భోగంపడుచుల్ని పెట్టుకుని ప్రశాంతంగా జీవితం గడుపుకొనే అవకాశాన్నీ యే పరగణా నైనాసరే సంపాదించాలని అతని ఆశ. అదృష్టం! కాని తీవ్రంగా సాగుతూన్న యుద్ధాలవల్ల యెంతమంది దగ్గరకు, యెన్నిచోట్లకు పరుగెత్తినా యింతవరకూ ఇతగాడి మనోరథాన్ని యీడేర్చిన మొనగాడే కనిపించలేదు. తలమునిగిన అప్పులూ, మితిలేని ఖర్చులూ, మనోవ్యాకులతా, నిత్యం నూతన మిత్రుల్నీ, యజమానుల్నీ వెతుక్కోవాల్సిన అవసరం, వీటికితోడు అపజయాలూ, మిత్రద్రోహాలూ,- వీటితో అతని ప్రాణం విసిగింది. స్వంతవ్యాపారాలు అశ్రద్ధచేయడంవల్ల రాబడికూడా తగ్గిపోయింది. మరో సేనాపతితోకలిసి ఉమ్మడిగా నడుపుతూన్న బట్టలమిల్లు వలనరాబడి తగ్గడమేగాక ఆ దుర్మార్గుడు శత్రువుల్లో కలిసిపోయేడు. వీటన్నిటివల్లా నిరుత్సాహంజెంది, యెక్కడికీ కదలక రైలుపెట్టెలోనే పాతుకుపోయేడీతడు. చిట్టచివరికి అల్పాచమానానికికూడా బైట కాలుపెట్టడంలేదుట! రైలుపెట్టే అతని ప్రపంచం అయిపోయింది. అందులోనే యితర జనరల్సు పంపిన అంగరక్షకులకీ, రాయబారులకీ విందులూ, వినోదాలూ జరిగిస్తూ, ప్రతివిందుకీ పోలెడంత డబ్బు తగలేసి ఫ్రెంచి సారాయిలు, చిన్న పిట్టలపులుసు, యింకా యెన్నో అపురూపమైన రుచ్యపదార్థాలూ తెప్పించుతూ కాలక్షేపం చేస్తున్నాడు..........

సేనాపతి ఉత్తరకుమార ప్రజ్ఞలు చెప్పడం ఆరంభించేడు.

"మీకేంఫర్వాలేదు. ధైర్యంగా వుండండి. ముద్దైన్ సైన్యాలింకా కొన్ని రోజులవరకూ నదిని దాటి రావడానికి ప్రయత్నించవు. ఈ లోగా నాసైన్యాలన్నింటినీ ప్రోగుచేసుకుని శత్రువుల్ని తొక్కి బ్రద్దలుచేసేస్తా." అంటూ వ్రేలితో మ్యాపుమీద ఏమిటో చూపించేడు.

తనమాటలు మేము నమ్మాలని తాపత్రయపడుతూ, ఏలాగైనా యీ ప్రస్తావన మార్చుదామని ప్రయత్నించుతూన్నాడు. ఎదుటిబల్లమీదినుంచి

'శాన్‌కో' అనే ప్రాచీనగ్రంథాన్ని తీసి, దానిలోని విశేషాల్నిగూర్చి కథలు చెప్పనారంభించేడు. పసుపు (హ్వాంగ్‌హో) నదీతీరమైదానాల్లో పూర్వ కాలంలో జరిగిన యుద్ధాల కథలూ, ఏనాడో చచ్చి స్వర్గాన్నవున్న మహా వీరులు ప్రదర్శించిన యుద్ధకౌశలమూ, పూర్వీకుల రాజనీతి చాతుర్యాలూ, శత్రుసేనల్ని భస్మంచేసిన సుడిగాడ్పుల్ని గురించీ, నౌకాయుద్ధాల్లో పాల్గొన్న పెద్దపెద్ద ఓడల చరిత్రాలూ, ఒకే రోజులో వందలకొలదీ మైళ్లు ప్రయాణంచేసిన అద్భుతమైన గుర్రాల్నిగురించీ, ట్సో-ట్సో యుక్తి ప్రయుక్తులూ, చు-గొ-లియాన్ స్వామిభక్తి విశ్వాసాలూగురించీ యెన్నో పూర్వగాథలు వర్ణించి చెప్తూంటే మా ప్రాణాలు విసిగిపోయేయి.

చాలసేపు చెప్పిచెప్పి నోరునొప్పెట్టి చాలించేక సేనాపతిదగ్గర సెలవు తీసుకుని బైటికి వచ్చేసేము. స్టేషను ప్లాట్‌ఫారంమీద సేనాపతి అంగ రక్షకులు గుంపులుగా కూర్చుని బాతాఖానీ కొడుతూన్నారు. వెడదరొమ్ము లూవాళ్ళూ. వాళ్ళంతా పూంచి బలంగావున్నారు. ప్రతివారిపద్దా ఒక్కొక్క మౌజర్ (ఒకరకంతుపాకి) వుంది. పైన యెండ మండిపోటూండి. వాళ్ళ కమేండరు ఏవో రాజకీయపాఠాలు చదువేస్తూంటే అంతా వింటూన్నారు. కమేండరు ఒక్కొక్కడినే "సన్‌యట్‌సేన్ యెవరు? ఐదు హక్కులు గల రాజ్యాంగం అంటే ఏమిటి?" అని అడగడం, వాడు లేచినిల్చుని సమాధానం జ్ఞాపకంరాక గుటకలు మింగుతూంటే కమేండరు ఫెడీల్ మని రెండుతగిలించడం; బుర్ర బరుక్కుంటూ, సణుక్కుంటూ వాడు కూర్చోడం; వానిప్రక్కవాడు లేచి అదివరకే బట్టీపట్టిన కొన్నివాక్యాల నేకరువుపెట్టి కూర్చోడం; యిదీ అక్కడ జరుగుతూన్న తంతు.

ముందుకు పోదామనుకుంటూంటే వెనకనుంచి యెవరో నాచొక్కా పట్టుకు లాగేరు. వెనకతిరిగి చూద్దునుగదా ఒక రష్యన్ రైతు నిలబడి వున్నాడు. నా ఆశ్చర్యానికి మేరలేదు. చింపిరిగడ్డం, రాగి వెంట్రుకలు, ఆకుపచ్చటి కళ్లు, ఎండకి కమలినముఖం, చీనా సైనికుని వేషంలోవున్న

అతడు చేత్తో సంజ్ఞచేసి నన్ను పిలుస్తూ "నువ్వు రష్యనువా ?" అని ప్రశ్నించేడు.

నేనూ అతనూ మాట్లాడుతూ స్టేషన్ పీఠకు నడచిపోయేము. తన చరిత్రంతా అతడు చెప్పేడు. తాను ఊరల్‌రాష్ట్రంలోని కోసక్ సైనికుడ ననీ, వెనక అన్నెన్‌కోవ్ సైన్యంలో పనిచేసేననీ చెప్పేడు. ప్రస్తుతం యీ సేనాపతివద్ద మెషీన్‌గన్ - మాన్‌గా పనిచేస్తూన్నాడు. రైలుపెట్టె కిటికీ క్రింద నిల్చుని సేనాపతికీ మాకూ జరిగిన సంభాషణనంతనూ విన్నాననిచెపుతూ, "మీరు భయపడనక్కరలేదు. ముగ్దెన్‌సేనలు నదిని దాటనేదాటవు." అన్నాడు.

"ఇక్కడికి తూర్పుగా యాభై కిలోమీటర్లలో ముక్దెన్ సైన్యాలు నది నీవరకే దాటి యీవలిగట్టుకు వచ్చేసేయి. ఈవేళ రాత్రే సేనాపతీ, ఉద్యోగులూ, చాలవరకు సైనికులూకూడ యిక్కడనుంచి వెళ్ళిపోతారు. మిగతావాళ్లం అందరముకూడ రేపు వెళ్ళిపోతాము." అంటూ కన్నార్ప కుండా ఆ రష్యన్‌గన్నర్ నావైపు చూచేడు.

మా చిరునామా వానిచేతికిచ్చి, ఏదైనా విశేషం వుంటే మాతో చెప్ప మని, మా మకాంవైపు వెళ్ళిపోయేము.

మరునాటి ప్రాతఃకాలాన్నే ఫిరంగి మ్రోతలు విని ఉలికిపడి లేచేసరికి గోలా, గంద్రగోళం వినిపించింది. మేమూ పరుగెత్తుకుంటూ వాకిట్లోకి వచ్చేసరికి హోటల్ యజమాని వంకరనవ్వులతో "ముక్దెనుసైన్యాలు పట్టణాని కైదు కిలోమీటర్ల దూరంలో వున్నాయి. కొండమీద ఫిరం గుల్ని వుంచి పట్టణాన్ని ముట్టడిస్తూన్నా రప్పుడే" అన్నాడు.

భయభ్రాంతులై తమసామానులన్నీ గాడిదలమీద కట్టుకుని బొంగురు గొంతులతో తిట్టుకుంటూ, అదలిస్తూ ప్రజలు పట్టణం విడిచి పారిపోతూ న్నారు. వీధులన్నీ జనంతో నిండివున్నాయి.

మేమూ ఒక్క పరుగున రైలుస్టేషనుకి పోయేము..........దారిలోనే విన్నటి కోసక్కు కనిపించి ఆగమని చేతితో సంజ్ఞచేస్తూ, ప్రభుత్వ

భవనంవైపు వ్రేలితో చూపించేడు. చిన్నలాగులూ, బనియనులూ ధరిం
చిన చీనావాళ్లు ఆభవనంమీది కుమిన్‌టాంగ్ జెండాను గబగబా దింపేస్తూ
న్నారు. మేము చూస్తూండగానే దాన్నిదించి మెల్లిగా మడచి సంచిలో
భద్రపరచి, ముక్డెన్ సేనలికి చెందిన ఐదురంగుల జెండాను పైకెత్తేరు.

స్టేషనంతా భీభత్సంగానూ, గందరగోళంగానూ వుంది. సేనాపతి
అప్పుడే ఒక ట్రెయిన్‌లో వెళ్ళిపోయేడు. మేమక్కడ వుండగానే
యింకోబండివచ్చి ఆగింది దానికి సామాను పెట్టెలూ, ఓపెన్ ట్రక్కులూ
వందలకొద్దీ తగిలించి వున్నాయి. వాటినిండా సైనికులే. పెట్టెల కప్పుల
మీదా, ప్రక్క చెక్కలమీదా, బఫర్లమీదా, యింజనుమీదా, టెండరు
(యింజన్‌లో బొగ్గువేసే డబ్బా) లోని బొగ్గుమీదా కూడ సిపాయీలు
క్రిక్కిరిసి కూర్చున్నారు. కొంచెం చోటు సంపాదించుదామని మేము
చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై పోయినాయి. పడమటికి పోయేబళ్ళు
యింకేమైనా వున్నాయేమోనని కనుక్కొవటానికి మాతోవున్న కోసక్కు
వెళ్లేడు. మేమూ ఓసామానులగుట్ట వెనక ఒదిగి నిలుచున్నాము. ఎవరూ
మమ్మల్ని చాలనగా చూడకుండవానికై మా వేషాలు మార్చుకున్నాం.
పలాయనం చేస్తూన్న సైన్యాలు అంతర్జాతీయ న్యాయసూత్రాలు పాటిస్తా
రనీ, మాకేప్రమాదం తెచ్చిపెట్టరనీ అనుకోడం ఎల్లాగ? సైనికులు
గుంపులుగా వెళ్లి ప్రక్కలైనుమీదవున్న సామానుపెట్టెల్ని హోలో
మంటూ లాక్కొచ్చి, మెయిన్‌లైను మీదికి త్రోసి వాటిల్లోకి ఎగబడు
తూన్నారు. వాళ్లగోల పట్టశక్యం కాకుండావుంది. రైల్వేకూలీలు బెదు
రుతూ, కంగారుపడుతూ అటూయిటూ తిరుగుతూన్నారు.

మధ్యాహ్నం అయేసరికి స్టేషన్‌మీదే ఫిరంగిగుళ్ళు కురవనారంభిం
చేయి. ఇంకో ట్రెయిన్‌కూడా బైలుదేరిపోయింది. మాకు దాంట్లోనూ
చోటు చిక్కలేదు. దిగబడిపోయిన సైనికుల్లో చాలమంది తమ చొక్కా
చేతులకి తగిలించుకొన్న బాడ్జీలనీ, టోపీలమీది జాతీయసైన్యపు తురా

యిల్నీ పీకి పారేస్తూన్నారు. కొందరు రైలుకట్ట వెంబడే పడమటిదిశగా పరుగెత్తుతూన్నారు. ఇంకేమీ లాభం లేదని నిరాశతో మేము వెనకతిరిగి పోతుంటే కోసక్ కనిపించేడు. మాకోసం ప్లాట్‌ఫారంమీద తెగవెతికే నంటూ మాయిద్దర్నీ వెంటపెట్టుకుని పట్టాలవెంబడే రెండుమూడు కిలో మీటర్ల దూరం తీసుకుపోయేడు. అక్కడో సైడింగులో చిన్నట్రెయిన్ ఒకటి బైలుదేరడానికి సిద్ధంగావుంది. రెండు సామానుపెట్టెలు, రెండు ఓపెన్‌గండోలాలు, చిన్నషంటింగ్ యింజన్ ఒకటీ, రెండు మూడు కంపార్టుమెంట్లూ,—యింతే ఆ ట్రెయిన్. దానితో ఆఫీసర్ల తాలూకు సామానంతా తీసుకుపోతున్నారు. మౌజర్లూ, తేలిక లూయీ మెషిన్‌గన్లూ, విచ్చుకత్తులూ ధరించిన సైనికులు ట్రెయిన్‌దగ్గర పారా తిరుగుతున్నారు. కోసక్ మమ్మల్ని కమాండెంటుకు పరిచయం చేసేడు. ఆకమాండెంటు సేనాపతి అంగరక్షకుల్లో ఒకడట. మాసంగతి విని, సామానుపెట్టెలో ఓమూల కూర్చోడానికి అనుజ్ఞనిచ్చేడు కమాండెంటు. బ్రతుకుజీవుడా అని మేము వెళ్ళి లోపల కూర్చున్నాము. పెట్టినిండా చెత్తా దుమ్మూ అసహ్యంగావుంది. ఇంతలోకే కోసక్ వచ్చి "మనం ఆఫీసరుకు కృతజ్ఞత చూపా" లన్నాడు. ఏభై డాలర్లుతీసి కోసక్ చేతిలో వుంచేను. ఈపాడు స్థలం యెప్పుడు వదలిపోతామా అని ప్రాణం విసిగేలా ఒక్క రెండుగంటలదాకా ట్రెయిన్ కదలనేలేదు చాలసేపటికి ఉక్కిరిబిక్కిరిగా ధూసరవర్ణమైన పొగను వదులుతూ, గుఫ్‌గుఫ్‌న నిప్పురవ్వల నెగ

ఒక్క కుదుపు కుదిపి, కంయ్‌మంటూ యింజన్ కదిలింది. ఎక్కడా మాబండి ఆగడంలేదు. ట్రెయిన్ మహావేగంతో యెన్నో స్టేషన్లు దాటి పోతూంది. ప్రతీ స్టేషనూ సైనికులతో నిండి గందరగోళంగావుంది. వాళ్లంతా మాట్రెయిన్ పోతుంటే ఉలిక్కిపడి, బండి దాటిపోయేటప్పటికి తెప్పరిల్లి మావైపు తుపాకులు కాల్చేవారు.

సాయంతనం అయింది. అస్తంగతసూర్యుని రక్తారుణకిరణాలు తేమగాఉన్న మైదానంలోని పచ్చికమీదపడి వింతశోభ కలిగిస్తూన్నాయి.

పగలల్లా పొలాల్లో పనిచేసుకుని అలసిపోయి, నాగళ్ళు భుజాలమీద పెట్టుకుని, కాళ్ళీడ్చుకుంటూ యిళ్లకు పోతూన్నారు రైతులు. వాళ్ళు ధరించిన నీలిరంగు గుడ్డలు చినిగి జీరాడుతూన్నాయి. పశులకాపరులు వెదురుకర్రలు బుజాలమీద పెట్టుకుని, ఐక్కచిక్కన పశువుల్ని నీర సంగా అదలిస్తూ నడచి పోతున్నారు. ఇక్కడంతా రైల్వేలైన్ హ్వాంగ్-హో నది ననుసరించే పోయింది. దూరాన బురదనేలల్లో, ఒంద్రులంకల మధ్యగా తళతళలాడే వెండినీటితో, పసిమినురగలు గ్రక్కుతూ హ్వాంగ్-హో నది అమాయికంగా ప్రవహించిపోతూంది.

ట్రెయిన్ యెక్కడా ఆగడంలేదు. చీకటిపడింది. మేమున్న పెట్టి తలుపులు తెరచేము. అందులో నేనూ, పాండూ, కోసక్, ముగ్గురమే వున్నాము. చల్లగాలికోసం కాళ్లు క్రిందిచెక్కలమీద పెట్టుకుని, చుట్టలు కాల్చుకుంటూ చివర కూర్చున్నాం. కాటుకలాంటి చీకట్లో నారింజపండ్ల లాంటి నక్షత్రాలు కన్నులకి పండుగ చేస్తున్నాయి. నిరివనిబిడాంధకారం చుట్టూఆవరించివుంది. దూరానవున్న నాజన్మభూమి జ్ఞాపకంపచ్చి, అక్కడ గడిపిన రాత్రులయొక్క మధురిస్మృతికి చకితుడనయేను. కోసక్ చేతులు మోకాళ్ళచుట్టూ పట్టుకుని అటూయిటూ ఊగుతూ పాటలు ఆరంభించేడు. వేగం యేమీతగ్గించకండానే దడాలున మా ట్రెయిన్ ఒక సొరంగంలో ప్రవేశించింది. చుట్టూ చిమ్మచీకటి; పొగ ఉక్కిరిబిక్కిరి చేస్తూంది. మసీ, నిప్పురవ్వలూ మా బట్టలమీద పడి చుర్రుమంటున్నాయి. అంత వేగంగానే ట్రెయిను సొరంగం దాటేసరికి చల్లగాలి సోకి మా ప్రాణాలు లేచొచ్చేయి. నోట్లోపడ్డ మసిబొగ్గు నెరుసుల్ని ఉమ్మేస్తూ, తలపంకిం చేడు కోసక్.

"మనం తుక్కుతుక్కుగా యెగిరిపోయి వుండాల్సిందే! కొంచెంలో తప్పిపోయిందనుకుంటా."

"ఏం? ఎంచేత?" అన్నాడు పాండూ ఆశ్చర్యంగా.

"మనబండిలో యేం తీసుకుపోతూన్నామో తెలుసా? ఇంజన్ తర్వాతి గండోలాలో మూడువందల యాభై పెట్రోలుడబ్బాలున్నాయి. అదంతా ఆఫీసర్ల మోటార్లకోసమే. తొందరలో మూతలుసరిగా అతికించకపోవడంవల్ల కొంచెంగా కారుతూన్నాయికూడాను. ఒక్క నెరుసు చాలు, భగ్గుమండిపోడానికి! ఆతర్వాతిగండోలాలోనే తుపాకిమందుంది. లోయాన్ ఆర్సినల్ కోసం మందుగుండు తీసుకుపోతూన్నాము. మందు పీపాలమీద కేవలం చింకిరికీలుగుడ్డ మాత్రం కప్పేరు. ఇంజన్‌లోంచి వచ్చే నెరుసులు సొరంగాల్లో దూరానికి యెగిరిపోలేక వెనకనేవున్న పెట్టెలమీద ముసురుకుంటున్నాయి."

పాండూ బుర్రబరుక్కుంటూ కంగారుగా నావైపుచూసేడు. భుజాలు కుదుపుకుంటూ నేను మరోవైపు తిరిగేను.

"మనం చేయగలదేముంది? ఇంతానయం, యీ ట్రెయిన్‌మీదేనా రాగలిగినందుకు సంతోషించాలి. మిలిటరీ ట్రైన్లల్లో చిక్కుబడివుంటే మనగతి వేరే చెప్పనక్కర్లేదు." అన్నాడు కోసక్.

"ముందు యింకా సొరంగాలున్నాయా?" పాండూ ఆదుర్దాగా అడిగేడు.

కోసక్ కిక్కు పరిహసించేడు.

"ఇక్కడి రైలుమార్గమంతా పర్వతాల్లోంచే పోయింది. తెల్లవారే లోగా పదిహేను యిరవై సొరంగాలు దాటిపోవాలి. అప్పటికిగాని లోయాన్ చేరలేము. పోనిద్దూ, వాటిమాటంటెగా! యుద్ధపురోజుల్లో అన్నిటికీ సరిపెట్టుకోవాలి. మరి. నిత్యం చచ్చేవాడికి యేడ్చేవాడెవడు!"

ఇల్లాఅంటూ కోసక్ తనపూర్వగాథ చెప్పనారంభించేడు. జీవితమంతా దేశదిమ్మరిగానూ, సైనికుడుగానూ గడిపేడు అతడు. తనకి నిలువనీడ లేకుండాచేసి, పొట్టకూటికై తోడిమానవుల్ని చంపేవృత్తికి పాల్పేసిన హతవిధినిగూర్చి చెప్తూంటే మాకే యెల్లాగో అనిపించింది. కథ

చెబుతూ ప్రతియిరవై నిముషాలకీ ఆగుతూండేవాడు. సొరంగం వచ్చి నప్పుడల్లా చిమ్మచీకటిలో, కమురుకంపుతో నెరుసులు మిణుగురులమాదిరిగా ముసురుతూంటే ఉక్కిరిబిక్కిరై పోయేవాళ్ళం. అంతసేపూ యెప్పు డెగిరిపోతామా! అని పళ్లు బిగించుకుని ప్రాణాలుగ్గబెట్టుకుని కూర్చునే వాళ్లం. సొరంగం దాటగానే అప్రయత్నంగా అందరు ఒకేసారి నిట్టూర్చేవాళ్ళం. కోసక్ విషాదగాధ మళ్ళీ ప్రారంభమయింది.

మీసకట్టుకూడా రాని వయసులో అతడు సైన్యంలో చేరేడు. ఆ తర్వాత రెండేళ్ళకి ప్రపంచయుద్ధం వచ్చింది. అప్పటికాతడు అవివాహితుడు. యుద్ధంవచ్చేక యూరల్ కోసక్‌ల పటాలాలతోబాటు యితడూ జర్మన్ రంగానికి పంపబడ్డాడుట. హాయిగా కాలుమీదకాలు వేసుకుని హుకుములు జారీచేసే రెన్నెన్‌కాంఫ్ రష్యన్‌పటాలాల్ని నడుపుతూంటే, వాళ్లు మసూరిన్ సరస్సురాల్లో, తూర్పుగేలిషియాలో, రుమేనియారంగంలో, టర్కిష్ ఆర్మీనియాలోనూ పోరాడేరు. ఈ యుద్ధాలన్నిటిలోనూ యితడూ పాల్గొన్నాడు. రెండుసార్లు యుద్ధఖైదీమై రెండుసార్లూ తప్పించుకుపోయేడు. యుద్ధం ఆఖరిదినాల్లో జారుసైన్యాలు చెదిరిపోయినపుడు యితడూ తన జన్మస్థానం చేరుకున్నాడు. తనగ్రామంలో స్థిరంగా వుండిపోదామనుకుంటూన్న సమయంలోనే జనరల్ కోల్చక్ తిరుగుబాటు ప్రారంభించేడు. అతను తెల్లసైన్యం యీతణ్ణికూడా తుపానులాగ లాక్కుపోయేయి. అదిమొదలు ఐదుసంవత్సరాలవరకూ దేశం యీ మూలనుంచి ఆ మూలవరకూ చెలరేగిన అంతర్యుద్ధాలలో పాల్గొన్నాడు. మొదట జనరల్ కోల్చక్ క్రిందా, తర్వాత అటమన్ సెమ్యోనోవ్ వద్దా, చివరకి అన్నెన్‌కోవ్‌దగ్గరా పనిచేసేడు. ఎర్రసైన్యం ప్రచండసూర్యునిలా విజృంభించడంతో అన్నెన్‌కోవ్ సేనలన్నీ పొగమంచులా విడిపోయినాయి. మన కోసక్ పోయిపోయి రష్యాసరిహద్దులు దాటి చైనాలో ప్రవేశించేడు. తోటి రష్యన్‌లతో కలిసీ, విడిగానూ కూడా యెందరో చైనాజనరల్సుదగ్గర పనిచేసేడు. చైనాకువచ్చిన యీ ఐదుసంవత్సరా

ల్లోనూ యెన్నో యుద్ధాలు చూసేడు. మైదానాల్లో. పర్వతాల్లో. ఎడారుల్లో. నదులమీదా యెన్నో యుద్ధాల్లో స్వయంగా పాల్గొన్నాడు. అదృష్టమాతకి ప్రసాదించిన ఆ మారణవిద్యనే ఆరాధిస్తూ యీ ఐదేళ్ళనుంచీ కాన్సా. షెన్సీ. హోనాన్ మొదలైన రాష్ట్రాలన్నీ సంచారంచేసేడు.

"ఇప్పటికి పదహారేళ్లుగా యుద్ధాల్లోనే పనిచేస్తూన్నాను. నాజన్మభూమికి పోగలననే ఆశ యింకేమీలేదు. ఇక్కడ యేదో పొట్టపోసికోగలను. అన్నిరకాల మెషీన్‌గన్‌లూ యెరుగుదును. దీపం అక్కర్లేకుండా కటిక చీకట్లోకూడా మాగ్జిమ్. కోల్టు. లూయీ. మరింకేమెషిన్‌గన్ ఐనాసరే అన్ని స్క్రూలూ విప్పి. మళ్ళీ అమర్చగలను. ఎంత చాకచక్యంవున్నా. ఎన్నివిద్యలు నేర్చినా. నాజన్మభూమిని మళ్ళీ చూడలేనుగదా? నాభార్యా బిడ్డ లేమైనారో? నాకొంపాగోడీ యేమైనాయో? నావాళ్ళంతా చనిపోయే వుండచ్చు; నాయిల్లు నేలపాలై వుండవచ్చు. నేనూ యిక్కడ ముగ్గిపోతూన్నా. ఏదో ఒక రోజున రాలిపోతాను. నాసమాధిమీద గుప్పెడు మన్ను వేసేవాడెవడూ లేడుగదా! నాపేరుచెప్పి యీవిశాల ప్రపంచంలో యేమీ మిగలదు. దురదృష్టదేవత నాకిళ్ళకు గంతలుకట్టి ఈదేశంనుంచి ఆదేశానికీ, అక్కడినుంచి మరోదేశానికీ లాక్కుపోతూంటే నాతో విలాసంగా ఆడుకుంటూందా? అనుకుంటూంటాను. చివరకి ఆ తుపాకిగుండ్లకు కూడా నామీద దయలేదు. మృత్యువుకూడా వన్ను చూసి దూరంగా తొలగిపోతూంది. ఏజనరల్ చూచినా పనిచెప్పేవాడేగాని యింటికి దారిచూపేవాడు లేడు........"

అంటూ కోసక్. మెల్లిగా గడ్డం నిమురుకున్నాడు.

దయ అంటే యెరుగని ఆతని శిలాహృదయం ద్రవించి. కంఠం రుద్ధమై పోయింది.

కోసక్ కధ పూర్తైంది. ట్రెయిను భడేల్‌మని మరో సొరంగంలో ప్రవేశించింది. సుడులు తిరుగుతూ నెరుసులు మామీద పడుతున్నాయి.

ఆ సన్నంగా నేవున్న మహాపదతటాలున స్ఫురణకు వచ్చి విర్విణ్ణులమై పోయేము.

ఆ రాత్రంతా ఒకసొరంగంలోంచి మరో సొరంగంలోకి పోతూ, మసికొట్టుకొని, భయం దహించేస్తూంటే బిక్కచచ్చి, యింటికి మొహం వాచివున్న కోసక్ చెప్పే కథలు విని కంపిస్తూ గడిపేము. మాకు నిద్ర యెట్లాపడుతుంది? భళ్ళున తెల్లారేవరకూ నాకంటిమీద కునుకేలేదు. అంతులేని నాదేశయాత్రల్ని తలుచుకుంటూ, బందిపోట్లూ, హంతకులూ, స్వార్ధపరులూ, పీడకులూ దేశాన్ని పీనుగుపెంటలతోటీ, భస్మరాసుల తోటీ ముంచెత్తి, అరాజకం చేయడం తలుచుకుని గుండెలు నీరవు తూంటే చూస్తూనే పడుకున్నాను. తెల్లవారగట్లలావుంది ఒక్కకునుకు పట్టింది. అదైనా కోడికునుకేగాని సేదదీర్చేదిగాలేదు.

ఉషఃకాలం. తూర్పుదిక్కు యింకా ధూసరవర్ణంగానేవుంది. ట్రెయిన్ ఆగింది. పెట్టెలోనుంచి బైటకు వచ్చేసరికి యెదురుగా లోయాన్ నగరం కనిపిస్తూంది. అదో పురాతననగరం. దుమ్ము మేఘాల్లాలేచి పట్టణాన్నం తనూ కమ్ముకొనివుంది.

ఈ నగరంలో యిళ్లకు కిటికీలే లేవు. దర్వాజాలు నేలమట్టాని కున్నాయి. దుమ్ము కొట్టుకునివున్న సిపాయీలు గుంపులు గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటూన్నారు. కంచరగాడిదలూ, ఒంటెలూ సామానులు మోసుకుని తోరణాలుగా విధీవిరామం లేకుండా పోతూన్నాయి. వాటన్నిటిమీదా తుపాకులూ, తోటాలపెట్టెలూ, పింగాణీ పాత్రలూ కుప్ప కుప్పలుగా పేర్చి వుంచబడినాయి. ఈ మహాజనప్రవాహమంతా పడమటి నుంచి తూర్పుదిశగా ప్రవహిస్తూంది.

ఒకానొకప్పుడీ పురాతన నగరం బహుసుందరముగా వుండేది. సిల్కు మజ్లినులకు, వేదాంతులకు, కుబేరుని తలదన్నే వర్తకులకు, సమస్త సంపదలకూ ఆలవాలమై యుండిన యీనగరం నేడు హద్దూపద్దూలేని

పటాలాలకు మధ్య మజిలీగా పనికివస్తూంది. పదమటినుంచి యిక్కడికి వచ్చినవాళ్లంతా పనికిమాలిన యుద్ధాల్లో సిపాయీలుగా చేరి పోరాడడానికీ, దిక్కులేనిచావు చావడానికీ పొట్టచేతపట్టుకుని వచ్చినవాళ్లేను. ఈపట్టణం దశ తిరిగి పోయింది.

మేము వచ్చిన ట్రెయిన్‌లోనుంచి పెట్రోలు డబ్బాలూ, తుపాకిమందు పీపాలూ దింపేరు. చాలమంది సైనికులూ, ఆఫీసర్లూ వాటిచుట్టూ మూగి యేవో గుసగుసలు పోతున్నారు. మాకోసక్ భావగర్భితంగా చిరునవ్వుతో మావగ్గరకువచ్చి, వాళ్లవైపు వ్రేసితో చూపించేడు.

"చూసేరా! రాత్రి మన ట్రెయిను ఎంచేత ప్రేలిపోలేదో యిప్పు డేనా తెలిసిందా? మా ఆఫీసర్లే మన పెట్రోలూ, తుపాకిమందూ శత్రువు లకు అమ్మేసి వాళ్ళతో చేరిపోయేరు. పెట్రోలుకు బదులు నీళ్ళూ, తుపాకి మందుకు బదులు యిసుకా పీపాల్లో నింపి మన ట్రెయిన్‌లో పెట్టేరు. ముక్డెన్ సైన్యపక్షం చేరి మన ఆఫీసర్లే మనకొంప ముంచేరు........"

అని చెపుతూ అతడు మావద్ద సెలవు తీసుకుని పట్టణంవైపు నడిచి పోయేడు. వెడదయైన ఆతని వీపు చూస్తూండగానే సిపాయీలగుంపుల్లో కనుమరుగై పోయింది. భయంకరమూ, నిరర్థకమూ, సమర్థమూ ఐన యీజనసమూహం గోలగా అటునిటు సముద్రతరంగాల్లా యెగసియెగసి పడుతూంటే, నిశ్చేష్టులమై లోయాన్ నగరాన్నిచూస్తూ, మానవుల బుద్ధి హీనతకు నివ్వెరపడి నిలబడిపోయేము.

2-6-1927, లోయాన్, హోనాన్‌రాష్ట్రం, చీనా.

**TALES OF MODERN CHINA.**

By: **Oswald Erdburg.** Rs. **1/-**

Trans. by: **Jagan Mohan, M.**

Pub: **VISWA SAHITYA MALA, RAJAHMUNDRY.**

## [illegible] గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| విప్లవసందేశం (8 కూర్పు) | రు 0 | 8 | 0 |
| లెనిన్ ఉపదేశాలు (2 కూర్పు. పాకెట్ ప్రతి) | 1 | 0 | 0 |
| ప్రపంచకార్మికోద్యమ చరిత్ర (2 కూర్పు ఒకే సంపుటి) | 1 | 4 | 0 |
| బలిదాన్ (సోవియట్ నాటకం) | 1 | 0 | 0 |
| సోవియట్ ప్రజాస్వామ్యం | 0 | 12 | 0 |
| వాద్యా (వివిధదేశాల కథలసంపుటి) | 1 | 0 | 0 |
| లెనిన్ జీవితకథలు (14 బొమ్మలతో - పిల్లలకు) | 1 | 0 | 0 |
| టాల్‌స్టాయ్ కథలు (పది కథలు) | 1 | 8 | 0 |
| గోర్కీ కథలు (ఆరు కథలు) | 1 | 8 | 0 |
| యక్షప్రశ్నలు (చిక్కుప్రశ్నలు - శాస్త్రీయ సమాధానాలు) | 1 | 8 | 0 |
| డిప్యూటీ షైట్మన్ (చీనా విప్లవకథలు) | 1 | 0 | 0 |
| ప్రతీకారజ్వాలలు (నవల - 2 కూర్పు) | 1 | 0 | 0 |
| రాజ్యాంగయంత్రం (లెనిన్ రచన - 2 కూర్పు) | 0 | 4 | 0 |
| ఇండియా (మార్క్సు - ఏంజెల్సు) | 1 | 0 | 0 |
| చీనా కథలు (ఆస్వాల్డ్ ఎర్డ్‌బర్గ్) | 1 | 0 | 0 |



షరా: 1. ఏజంట్లకు 25% న్ను, లైబ్రరీలకు 12½% న్ను కమీషన్ యిస్తాము.

2. ఖర్చులు ఏజంట్లే భరించాలి; ఆర్డరుతో అడ్వాన్సు పంపాలి.

3. రు 5/-లు మించి కొనువారికి ఖర్చులన్నీ మేమే భరించుకుంటాము.

విశ్వసాహిత్యమాల,

లవంతీ ప్రెస్ బిల్డింగ్స్ - రాజమండ్రి.

